# పొట్టి రవికలూ – వాలుజడలూ

[ మున్నగు పది కథలు ]

(కవి)

## కవికొండల వేంకటరావు

---

కథల వివరము



సుమనోహ్లాదిని శీర్షిక — వెల
అయిదవ భాగము — 1952 — రు. 1—0—0

అభినవాంధ్ర కార్యస్థాన
సుప్రకాశితము.

# పరిచయవాక్యములు

ఈ పుస్తకము ముద్రణము నందు 1948–1950 వినూతన ప్రణాళికకు సంబంధించిన దయినను, ఇందలి కథలను పాఠకులు 1941 లో ముద్రింపబడిన "సుమనోహ్లాదిని" మొదటి భాగము కథలు "కలిపురుషుడు" మున్నగు వానితో జతపరచుకొని చదువుదురు గాక !

| | |
|---|---|
| రాజమహేంద్రవరం | కవికొండల వేంకటరావు |
| | "కవి" |
| ఖర మకర సంక్రమణం | "కొండకొలకు — వికసితోత్పలం" |

౧

# పొట్టిరవికలూ - వాలుజడలూ

---

ఆ చేడెల కిద్దఱికీ ఎంత నేస్తంఅంటే కుళాయిసీన్లకెళ్లేటప్పుడు కూడా ఉత్తబిందె ఇద్దఱూ తోడట్టుకెడతారు. తోడికోడళ్లా అంటే తోడికోడళ్లు కారు. ఒక యింటి ఆడపడుచులా అంటే వాళ్లూ కారు, వదినే మరదండ్రా అంటే ఉహూ. కట్ట యీడూ యిద్దరిదీకూడా. ఇద్దరిచాయా కూడా సాయంకాలం నీరెండలో నీలాంబరపుష్పావన్నె ననుకరిస్తూ వుంటుంది. రోడ్డు మీద ఇద్దరి నీడలూ ఒకటేపొడుగు; ఇద్దరి జడలూ వాలుజడలే. నల్లని ఒత్తుకురులు పెనేసి చివర రిబ్బను ముక్కలు ముడెట్టి సాగలాగినవే. వెనక్కు వెన్నుపూసనే పడేస్తే పిఱుదులకందం. ముందుకు బుజమ్మీదనుంచి తీసుకుంటే ఉరోజాలకందం. జడలంటే అలావుండాలి. ఏమి చెణ్ణేకుండా కప్పవలసిన చోట కప్పుతూ, కుప్పసం కొంచెం కుస్తవగుడ్డ తక్కువదైనా కాపాడాలి, కచమన్నాక కుచాన్ని.

ఏమంటే ఈ రోజుల్లో రవికలు బొత్తిగా చిన్నవి పలచనివి కుట్టించేస్తున్నారు స్త్రీలు. వాటిని రవికలనడానికి వీల్లేదు. —ఇక్కడ కొంచెం కథకు సందర్భించని రెండుముక్కలు జ్ఞాప

కం వస్తూన్నాయి; భారతగాథలో ఇతిహాసాల్లాగు—రామా
యణంలో పిడుకల వేత కాదులేండి. ఇంపుగానే వుంటాయి,
స్త్రీలు కులాసాగా అంతావిని చివరచిరాకు పడ్డాగానీ—

ఒకావిడ రైక సరిగా తొడుక్కో కుండానో సగం సగం కన
బడేలాగు తొడుక్కొనో, మగని దగ్గఱకెళ్లి "ఆర్యపుత్రా!
రవికాసనిచో కవిగాంచునేగదా" అంటారే కవిచూంచేది ఏమి
టండీ?" అని అడిగిందట. అంటే భర్త "సీబోర" అన్నాట్ట
చళ్లున చపేట ఇచ్చినట్టు. ఆమెపాపం—రవి అంటే సూర్యుడు,
సూర్యుడు కాననిచో అని ముచ్చటగా ముద్దుగా ఊహించు
కడిగింది, అతగాడు ఆపెడర్థాల పెనిమిటి, రవిక = రైక, ఆస
నిచో=సరిగా ఆనకపోతే అనగా అమరక పోతే, అంటి ఉండక
పోతే, అని ఆయిల్లాలి రూపు సందర్భాన్ని బట్టి అలా అధ్యా
స్నం పధ్యాహ్నంగా అన్వయించేడు కాబోలు—దగ్గరే కవి
ఉంటే ఎంత సిగ్గుపడిపోయేదో ఆపణతి- దానికేం, భార్యాభర్తల
మధ్యసవాలు అది. మరోగాథ విన్నది చెప్తాను. ఒకాయన బావ
వరస వాడు ఓపడుచు మఱదల్తో కబుర్లు చెబుతూ వంటింట్లో
కూర్చున్నాట్ట. ఆ మఱదలు నూరాగుమ్మడికాయ దబ్బీమని
కూరకో పులుసుకో నేలనేసి కొట్టి ఓముక్క కత్తిపీటను పర
పరా తరుగుతూందిట, ఆమె అసలే రవిక తొడుక్కోని పడుచు
పిల్ల. మడికి పలాచటి బిన్నీకంపెనీ తెల్లచీరకట్టుకోని ఇలా తరు
గుతూంది — అరచాటగు ఆంధ్రవధూటి జ్ఞాపకం వచ్చేటట్టు.

ఈ బావ తోచ కో మంచి దుక్కలాంటి ఉబ్బివున్న గుమ్మడి గింజ జారుజారుది తన కుడిచేతి బొట్టన వ్రేలికి తర్జనికి మధ్య పెట్టుకొని యాదాలాపంగా నొక్కేట్ట—చఱ్ఱున వెళ్లి తిన్నగా అది ఆ మరదలి దక్షిణ చూచు కాగ్రమ్మీద తగిలిందట—ఎడంభాగం గుండె అదిరేట్టు. పైకేమంటుందీ? ఓర్చుకుని ఊరుకుందట. ఇవన్నీ స్త్రీయొక్క మానం కాపాడ్డం అనే రస వత్తర ఘట్టాని కుపాఖ్యానాలు—చూడండీ! అపరిస్థితుల్లో కనక జడలేఅడ్డుంటే స్త్రీకి సిగ్గుపడవలసిన అవసరంలేదు. అపాయం తటస్థించదు. అందుకే కొందరు బుద్ధిమంతు రాండ్రైన పెద్ద ముత్తైదువులు ఇప్పుడిప్పుడు జ్ఞానం తెచ్చుకుని సిగలూ కొప్పులూ మానేసి వాలుజడలే వేసుకుంటున్నారు.

ఇక అసలు కథకు వద్దాం. జడలన్నవి ఆలావుండాలి. అందుకోసం కావాలి—ఇంతకూ చదువరుల్ని ఓసందేహంలో వదిలేశాను. ఆ చేడె లిద్దరూ ఇంతకూ రవికలు తొడుక్కున్నవాళ్లా, తొడుక్కున్నా చాలీచాలని రవికలు తొడుక్కున్నవాళ్ళా, లేకపోతే యేమిటి అని ఇంతవరకు వివక్షత చెప్పకుండా వుండడమనేది నాదే క్రౌర్యము. వాళ్లకిద్దఱకూ రవికలున్నాయి. తెల్లని గ్లాస్గోమల్లువి మెడదగ్గర ఊటకలం తగిలింపు కనుకూలమైన చంద్రవంక కత్తిరింపువీ, బుజాలు పైని దిగలాగితే దిగుచాయను గాలి దేవుడు కితకితలెట్టేవీ—రవికలు తొడుక్కున్నా లేనట్టే అని భావించుకోండి. ఇక చీరకట్టు తదనుగుణ్యాం. గాలి

వాళ్ళకు ఎదురుగా వస్తోంది. అప్పుడే అందం అంతా! ఆడో గాడిదిని కదలే స్తంభాలవంటి తొడల మధ్య నా స్త్రీలయొక్క చీర కుచ్చెళ్ళు కొడికొడిగా పోతూంటే ఆవ్యంగ్యాని కంతే లేక పోయింది మగవాళ్లు నుకొన్నారంటే అనుకోరు మరి?

అంతలో ఒకడికి పెద్ద బుగ్గ మీసాలు. ఒకడికి ఫ్రెంచి కట్. — ఫ్రెంచికట్ వాడన్నాడు "ప్రేమసువాస నేను కుంటూ వస్తూన్నది. కానుకో" అన్నాడు. బుగ్గమీసాల వాడు తన చేతితో మీసాలు సవరించుకొని ముక్కు సరిచేసు కొనేలోపున స్త్రీలిద్దఱూ వాళ్ళను దాటిపోయినారు. "ఎక్కడ!" అన్నాడు బుగ్గమీసాలవాడు. అందుకే అంతంత మీసాలు తీసేసి నాలాగు ముక్కుకింద మాత్రమే కాస్సి పలచ పలచగా ఉంచుకోమంటాను. — చెయిపెట్టి మీసాలు ఒత్తుగించుకొని ముక్కుసోణాలు పెద్దవి చేసుకొనేదాకా ప్రేమవాసన నీకోసం ఆగివుంటుందా? ఇప్పుడే ఆలా వెళ్ళింది. గుమ్మెత్తిపోయింది నాముక్కు." అన్నాడు ఫ్రెంచికట్‌గాడు. "అంతగా వాసనే ప్రాముఖ్య మైంది అని తోస్తే ఆ రెండు వెంట్రుకలూ మాత్రం ఎందుకు?" అన్నాడు బుగ్గమీసాలవాడు. "ఈ రోజుల్లో ప్రేమదాని యొక్క ఆఘ్రాణపు ఘాటునుబట్టి గ్రహించుకోవడం కాకపోతే పాణిగ్రహణేన అనుకొన్నావా యేమిటి? కాదు. ఇక ముక్కు కింద ఈ రెండు వెంట్రుకలయొక్క ప్రయోజనం చెప్ప మన్నావా? అవి మగవాళ్ళకు గుర్తు. లేకపోతే ఆడమొగానికి

పేడిమొగానికీ తేడాయే తెలీదు. — ఏమైతేనేం హేటుంటూ వుంటే ఫ్రెంచికట్ ఉండాలి మీసాలకు." అని తన నెత్తిమీద హేటుతీసి చంకలో పెట్టుకొని "నీకేం పరిమళించలేదూ? బొత్తిగా పరిమళించలేదూ ప్రేమ? — ఆ వెళ్ళేపిల్లలిద్దరూ మిషన్ బోర్డింగులోని పిల్లలు. ఓదాని పేరు మిస్ పుస్సీఫుట్టు, రెండవదానిపేరు మిస్ థారంటన్. నీక్కావలిస్తే అంటే మిస్ థారంటన్ని ప్రేమించుకోవచ్చు. మిస్ పుస్సీఫుట్టు నాది —" అన్నాడు ఫ్రెంచికట్ మీసగాడు. బుగ్గమీసాలమనిషి అన్నాడు, "నేను అచ్చువైదీకప్పుముండావాణ్ణి — మీసాలు పెంచుకొనేసరికే మాతాత ముత్తాతలు పైని తహతహ లాడి పోతున్నారు. ఇక మిస్ థారంటన్నుని ప్రేమిస్తే తార్ తారయి పోరూ! అది వర్ణాంతర వివాహంకూడా కాకుండా — మతాంతర వివాహంకూడా అయిపోయి అటు బంగాళా ఖాతాన్ని ఇటు అరేబియా సముద్రాన్ని ఉప్పెనెత్తించి దక్కను పీఠభూముల్ని హిమాలయా శిఖరాల్నికూడా ముంచేస్తుంది. భారతవర్షం పిపీలికాది సమేతంగా సఫా —" అన్నాడు. ఫ్రెంచికట్ గాడన్నాడు "ఈ వేళకు ఈ చూపూ ఈ వెలుగూ చాలుమనకు. గుడ్ నైట్!" అన్నాడు. ఎవరికి వాళ్ళు వెళ్ళి పోయినారు.

నిజంగా ఆ స్త్రీలెవ్వరో ఆ మగవాళ్ళకు తెలియదు. ఆ మగవాళ్ళెవరో ఆ స్త్రీలకు తెలియదు. బాధ్యతలేని మగాళ్ళు

ఆడాళ్ళనుగురించీ, బాధ్యత లేని ఆడాళ్ళు మగాళ్ళను గురించీ, ఏదో అనుకుంటూ ఉత్తర క్షణమందే మరోపనిమీద ఏమటి పోయే వెఱ్ఱి చిద్విలాసపు నాటక ప్రదర్శనం అనుకోండి ఆ సాయంకాలం ఆ పురుషుల సంభాషణా ఆ పడుచుల సందర్శనమూను.

కాలనేమికింద అయిదారేళ్ళు నును పెక్కు పప్పాపప్పు అయి పోయినాయి. ఈ పైని వ్రాసేది అప్పటిమాట. మిస్ థారం టన్ ఒక డిప్యూటీ ఇన్స్పెక్టరిన్ ఆఫ్ గర్ల్సుస్కూల్సు అయింది. బుగ్గమీసాలమనిషి ఎక్కడా ఉద్యోగం దొరక్క ఒక ఆడ పిల్లలబడ్లో తెలుగుచెప్పే బడిపంతు లయినాడు. మిస్ థారం టన్ ఆ గర్ల్సుస్కూలు పరీక్ష చేయడానికి వెళ్ళింది. గడగడ లాడుతూ బుగ్గమీసాలాయన నిలబడి అమ్మగార్కి సలాం పెట్టినాడు.

మిస్ థారంటన్ అంది "ఏమండీ! మాష్టర్! మీముఖం ఎక్కడో ఈవఱకు చూచినట్టుగా ఉన్నదండీ" అని. "ఏమిటో వైదీకి మీసాలు తల్లీ!" అన్నాడు వెఱ్ఱిబాగులాయదులాగు బ్రాహ్మడు. మిస్సమ్మగారన్నారు. 'వేడిక్ముష్టాష్'! అని. తెలుగు పండితుడు "ఇంకేం వేడితల్లీ! కాగి చల్లారిన పాల లాగు అయిపోయాను. నలుగురు పిల్లలూ భార్యా మునీలితల్లీ — ప్రమోషన్కు రికమెండు చెయ్యాలి" అన్నాడు. "మిస్ పుష్పవల్లు ఇన్స్పెక్ట్రెస్ ఆఫ్ ఫస్టు సర్కిల్. ఆవిణ్ణి చూడండి."

అంది మిస్ థారెంటన్. "కాని ఆవిడ ప్రియుడిది ఫ్రెంచికట్. ఆలోచించుకోండి." అని అందికూడాను, వినిపించీ వినబడ నట్టు. అంతకంటె వినిపించీ వినబడనట్టు పండితరాయలన్నాడు "అయితేం అమ్మగారూ ఆవిడదీ పొట్టి రయికే వాలుజడే అను కుంటాను ఇప్పటికీ! స్వతంత్రించి ఆర్డరు వెయ్యకపోరు. వెళ్ళి తప్పకుండా దర్శనం చేసుకుంటాను." అని. తెనుగు మాష్టరు మహా చెడ్డముండాకొడుకు!!!



| రచన | స్ఫురణ | తొలి ప్రకటనము |
| --- | --- | --- |
| 20-7-1984 | రాజమండ్రి | "వినోదిని"లో |

# ౩

# పెద్దూరు

---

పిట్టకబుర్లు చెప్పడంలో ఘట్టు కొండుభట్టు. ఉన్నవోకొన్ని, లేనివోకొన్ని, తనకు తెలిసినవోకొన్ని, తెలియనివోకొన్ని పేర్లుమార్చి కథలమాదిరిగా కల్పించి, వినేవారికి విసుగు లేకుండా చెబుతాడు 'వాకలగరువు' వుంటే 'పోగలపాలెం' అనీ, 'పేరూరు' వుంటే 'పెద్దూరు' అనీ 'అమలాపురం' ఉంటే 'నిర్మలాపురం' అనీ 'రామయ్య' అయితే 'వెంకయ్య' అనీ 'శ్రీరంగపట్నం' వుంటే 'శంకరగిరిమన్యం' అనీ ఇలాగ్గా మార్చి నవారల్లినట్లల్లుతాడు — ఎంతచిత్రంగా నన్నా — ఓనాడు చెప్పేడతడు.

"నిర్మలాపురం మునసబుకోర్టులో పూర్వం నర్సయ్యశర్మ అనే అమీనాగారుండేవారలు. ఇక్ష్వాకుల కాలమ్మాట. ఆరో జిల్లో బ్రాహ్మణులే చాలామంది అమీనాలుగా వుండేవారట, — జప్తులు చేసినా, ఖుణాస్థుల్ని పట్టుకున్నా, వేలాలు వేసినా వారేనట. అమీనాహోదా అంటే మునసబుగారి తరువాత హోదాగా ఉండేదట ఆలా మునసబుగారు జప్తు ఆర్డరువేస్తే మధ్య నాజరుగారి ప్రమేయం లేకుండా అమీనాగారు తిన్నగా ఆ ఆర్డరే తీసికొని అమలుజరుపుతూ వచ్చే రివాజట,

ఆ కాలంలో ఆ కోర్టు మునసబుగారు కూడా వాళ్ళకు తగ్గా ఆయనే దొరికేడు. ఆయన సంస్కృతమంటే చెవి కోసుకొనే రకం. పురాణం వినడం అంటూ వస్తే భోజనమున్నా సరే, కోర్టుపని అయినాసరే, మానేసేసి, ఇవాళ కోర్టు మత్తరవు, అని ఎక్కడపడితే అక్కడ పురాణంలో లీనం అయిపోయే మనిషి. సాక్షిబోనులో కెక్కితే వాని వరస చూచి శాస్త్రిల్లుగారైనా యొక్క శ్లోకమైనా చదివించకుండా వెళ్ళనీయడు. కొండొకచో సాక్షి వాఙ్మూలాల్లోకి అనాయాసంగా శ్లోకాలు కూడా దొర్లుకు పోతూనే వుండేవి అనీ, అవి అప్పీలు కోర్టువారు బ్రాకెట్లల్లో పడేసి మిగతా వాఙ్మూలమే చదివే వారనీ హైకోర్టు ప్లీడర్లు చెప్పేవారు.

మన వెంకయ్యగారు కోర్టు ఆవరణలో ప్రవేశించి యెక్కడన్నా ఆయన వియ్యంకుడుగారైన అమీనాగారు నరసయ్యశర్మగారు అగపిస్తారేమో అని నెమకి చూచి, కానక, ఇప్పటి నుంచీ పోకలపాలెం వెళ్ళి మాత్రం చేసేదేమిటి ఇక్కడే ఈ బ్రాహ్మణ్యంతో కాస్సేపు ముచ్చటిద్దామని రావిచెట్టు క్రింద ఓరసిలగ కూర్చున్నారు.

కూర్చుని అలా రావిచెట్టుకేసి చూస్తూంటే ఆయన పురాణభక్తుడు కాబట్టి ఆ రావిచెట్టే పొన్నచెట్టు అయిపోయి ఆ కృష్ణమూర్తి గోచరించి ఆయనచేత మొదట్లో అస్పష్టంగా "రాధే గోవిందకృష్ణ" "రాధే గోపాలకృష్ణ" లోలో అనిపించి

2

నాను. క్రమంగా అది లోపల పట్టలేక పైకి పాడుతూ గంతులేసినారు. ఎవరు ? శంకరగిరి మన్యాంలోనుంచి వచ్చిన వెంకయ్యగారు. ఆ గంతులకు చుట్టూ వున్న బ్రాహ్మణ్యాం చేరి వెంకయ్యగార్ని ఎరక్కపోయినా మహాభక్తునిగా గుర్తించి చుట్టూ కూర్చుండి చూచేరు. చూస్తూవుండేలోపలే, వెంకయ్యగారు వ్యాసప్రోక్త భాగవతములోని రాసక్రీడఘట్టము కంఠోపాఠంగా ఒప్పజెప్పుచూ ఫెల్లున ప్రత్యక్షశయ్యా నర్థము సెబుతూ తాండవమాడిపొయ్యేరు. బ్రాహ్మలందఱూ తమర్ని తామ్మఱచి ఆయనచుట్టూ కూర్చున్నవాళ్లల్లా నిలుచుండి గోపికల్లాగ తిరగడం మొదలుపెట్టినారు.

లోపల్నుంచి కోర్టువాడువిని "ఏమిటోయి గల్లంతు? ఎవరోయి అమీనాలు అక్కడ? ఆ గల్లంతుచేసే మనిషిని ఇలా లాక్కురండి" అన్నారు. అక్కడప్పుడున్న అమీనాల్లో ఉన్నాయన శర్మగారే. అప్పుడే యేదోవేలం, అక్కడే పాటదార్లచేత సంతకాలుచేయిస్తూ పూర్తిచేసినారు. కోర్టువారి మాటవిని వెంటనే తనచేతిలోని కాగితాలు మడతపెట్టి వారంటు ఇలాకా గుమాస్తాకిచ్చి, తాను "ఎవరాగల్లంతు?" అంటూ యీవలకు వచ్చేసరికి, బ్రాహ్మణ్యమంతా తమకొంప మునిగిందనుకొని పారిపోయినారు. వెంకయ్యగారుమట్టుకు 'రాథే గోవిందకృష్ణ. రాథే గోపాలకృష్ణ' అని స్మరించుకుంటూ అక్కడే వుండిపోయినారు. ఆయన్ని అమీనాగారు, మన శర్మగారు, రెక్కదొరక

బుచ్చుకొని 'రాండి! కోర్టువారు పిలుస్తున్నారు!' అన్నారు. శర్మగార్ని వెంకయ్యగారు వెంకయ్యగార్ని శర్మగారు పోల్చుకున్నారు. సంబంధీకులుగా గ్రహించుకున్నారు. కాని అలాంటి పరిస్థితుల్లో ఏమీ పైకనుకోవడం బాగుండదనో ఏమో కేవలం లౌకికవాళ్ళలాగే ప్రవర్తించేరు.

శర్మగారు వెంకయ్యగారి రెక్కపట్టుకొని లోపలకు తీసుకువెళ్ళేసరికి కోర్టువారు దిగ్గునలేచి 'ఇలా దయచెయ్యండి' అని ఆయన సరసనే యొక కుర్చీవేయించి కూర్చోమన్నారు. కోర్టులో వున్నవారంతా నివ్వెరపడిపోయేరు. 'కోర్టు మర్తరవు' అన్నారు మునసబుగారు. తరువాత వెంకయ్యగారి దిక్కు మొగంపై "మీరు పండితులనితోచి తీసుకురమ్మన్నాను. అంతే. పరాయివారనికాదు. మీరక్కడ 'రాధేగోపాలకృష్ణ' అని అంటూంటే నాకిక్కడ కలంనడవక ఆగిపోయింది వినబడి. ఈరాత్రికి మీరు నాయింటనుండిపోయి పురాణంచెప్పాలి" అన్నారు. "తమసెలవైతే ఇంతకంటేనా?" అన్నారు వెంకయ్యగారు. "ఎక్కడికి వెళ్ళాలిమీరు!" అన్నారు మునసబుగారు. అప్పుడు వెంకయ్యగారు శర్మగారికేసి చూచి "వీరమ్మాయిని మా అబ్బాయికిచ్చారు. కోడల్ని శ్రావణశుక్రవారం నోముగ్గాను, తీసుకొని వెడదామనివచ్చే" నన్నారు వెంకయ్యగారు. 'ఓ మాశర్మగారి వియ్యంకుడుగారా! మీరు? శర్మా! మీ యింటికి రేపుపుదయం మా మేనాలో మీ వియ్యంకుడుగార్ని వారి కేలోపం లేకుండా పంపించివేస్తూ వున్నాను. నీవువెళ్లు. నీపనిచూచుకో' అన్నారు.

ఆరోజుల్లో ఉద్యోగస్థులు ఎక్కడకు వెళ్ళడం వచ్చినా మేనాల మీదనే వెళ్ళేవారు. కోర్టుకు రావడం మేనా మీద వచ్చి మన మునసబుగారు దేహపరిశ్రమకాస్త వుండాలంటూ ఇంటికి వెళ్ళేటప్పుడు నడచి వెళ్ళేవారు. కాని మేనా గుమ్మంలో ఎప్పుడూ అరుగుమీద వుండేది. బోయీలు వాకిట్లో నిరంతరం వుండేవారు పొద్దుపోయేదాకా. ఆకారణంగా ఇంటికి వెళ్ళి వెళ్ళడంతోటే పై సంభాషణమైనాక, మునసబుగారు చాకలివాళ్లను రాత్రి తమయింటివద్దే పడుండమనీ తూర్పు తెల్లారేలో వెంకయ్యగార్ని శర్మగారింట దిగబెట్టవలసిందనీ హుకుం జారీ చేసినారు.

మునసబుగారు వెంకయ్యగార్కి మర్యాదోపేతంగా కుడువ విందుపెట్టి శివాసీ పఠింపించి పెద్దసభ గావించి వెంకయ్యగారి చేత అష్టాదశ పురాణాల్లోని సంగతులు వచ్చేటట్టుగా తెల్లవార్లు చెప్పించేరు. తెల్లవారుతూండనగానే "వెంకయ్యగారూ తమరీ మేనాలో దయచేసి మీ వియ్యంకుడుగారింటికి వెళ్లవలసిందని నాప్రార్థన" అన్నారు మునసబుగారు. మునసబుగారు స్వయంగా "ఓ పీరిగా! ఓ పేరిగా! ఓ పుల్లిగా!" అనిచాకలి వాళ్లను కేకేసి "ఎత్తండి మేనా ఎత్తండి" అని అన్నారు. వెంకయ్యగారు "ఎందుకండీ మేనా గీనా!" అన్నాగాని మునసబుగారు "పల్లకి తన కేలపట్టి యెత్తె" నన్నట్లు తాం కూడా చేయేసి సాగనంపినారు. పెద్దందుకు వెంకయ్యగారు! ఏం ప్రతిభ! ఏం ప్రజ్ఞ! అనుకుంటూ లోపలికి వెళ్ళిపోయినారు.

ఇక శర్మగారైనా 'మీరు వెళ్లండి' అని మునసబుగారన్న పాళంగా అక్కడ వుంటే ఏంటక్లో అని తిన్నగా పెద్దూరు మీదుగా పోకలపాలెం దాటిపట్టేరు. అప్పుడు పెద్దూరు బ్రాహ్మ ణ్యం అంతా ఆయనచుట్టూమూగి "బాబూ మేమక్కడుంటే మమ్మల్నందర్నీ మీరు నిన్న కొట్లోకి తోసేసేవారే!" అన్నారు. శర్మగారు నవ్వుతూ "ఎంత వెఱ్ఱిబ్రాహ్మణ్యం అయ్యో మనది! ఆయన మా వియ్యంకుడుగారు మా రెండో అమ్మాయి పెళ్ళికిచూచే వుండేరు. మఱచి పోయినారేమోగాని. ఆయన్ని మునసబుగారు - కోర్టుమునసబుగారు మర్యాదచేసి తమ ప్రక్కన కూర్చో పెట్టుకున్నారు గాని, కొట్లో పెట్టించలేదు. ఈ రాత్రి వారింట పురాణం చెప్పి రేపుదయం మీ వూరిమీదుగా వారి మేనాలో వచ్చేరు." అని మొహర్బాణిగా ఆడేసి వెళ్ళిపోయినాడు.

పెద్దూరి బ్రాహ్మణ్యం అక్కడ ఆ పెద్దూర్లో — ఇక్కడ మునసబుగారింట్లో వెంకయ్యగారు పురాణం చెప్పుతూ వుంటే అక్కడ ఆ పెద్దూర్లో ఆ బ్రాహ్మణ్యం ఓసభ చేసినారు ఆరాత్రి. "మన వూరిమీదుగా ఇదివఱకుద్యోగస్థులమేనాలు ఎప్పుడూ వెళ్ళలేదు. రేప్పొద్దున్న మునసబుగారి మేనా యిలా వెడుతుం దట, ఆయన్నెవరో తీసికొని (అహంభావములో ఆ బ్రాహ్మణుల కప్పుడు అంత క్రితం వాళ్లను గంతులు వేయించిన వెంకయ్య గారు ఎవరో అయిపోయినారు) వెళుతుందట! మనమంతా అడ్డుతగలాలి. కట్టలుచ్చుకు ఎవరిగుమ్మంలో వాళ్లం నిలుచుని

వున్నట్టుగా వించోని ఆసవాకీ చెక్కలు విఱిగేటట్టు చితగ్గొడదాం" అని తీర్మానించుకున్నారు,

శర్మగారి కదేం తెలీదు. వెంకయ్యగారి కంఠకంటె తెలీదు. వెంకయ్యగారు తెల్లవారడంతోనే పూర్వోక్త ప్రకారంగా మేనాఎక్కి చాకలివాండ్రు 'ఓంబాయి' అనిమామూలు ప్రకారం కేకలు వేసికొంటూ మోసికొనిరా, వూగుతూ వున్నారు. ఇంటిదగ్గఱ శర్మగారు వియ్యంకుడుగా రొస్తారని మర్యాదగా చాపా అదీ వేసి కాళ్లు కడుక్కోవడానికి నీళ్లూ అంగోస్త్రం పెట్టి ఎదురు చూస్తూవున్నారు,

కొంతదూరం వెళ్ళిన తరువాత పెద్దూరుగుండా మేనావచ్చే సమయానికి చాకలి వాళ్లు మూచేసు పెద్దూరు బ్రాహ్మణ్యాం కర్రలేసుకు గుమ్మాల్లో నిలబడ్డం. సవారిదింపితే తమకీ, మేనాలోకూర్చున్నవారికీ, మునసబుగారికీకూడా నామోషే. దింపకపోతే సవారీ పగలగలదు. వాళ్ళ బుర్రలున్నూ:— వాళ్లకేం తట్టిందో తత్క్షణం చాకలివాళ్లంతా మామోలు కేక మానేసేసి "ఉద్యోగస్థుల మేనాకాదిది ఓంభాయిఓం! విద్యావంతుల మేనా అండోయి ఓంభాయిఓం!" అంటూ మోసుకెళ్లేరు, ఊరావలికంటా, ఎక్కడున్న బ్రాహ్మణులక్కడ ఎత్తినకర్రలలా వాలుగా వుంచేసేరు, విద్యావంతుల మేనా అనేసరికి అప్పటిదాకర్రలు ఆమేనా మీాద ఎలావున్నాయి అంటే బాలభటుల కర్రలు

తనక మర్యాదకోసం బాలఘటనాయకుని నెత్తిమీదకు పట్టినట్టు 'అర్చి' కట్టి గౌరవం సూచించినాయి.

లోపలున్న వెంకయ్యగారు ఆ కేకమార్పు తెలిసికొని తరువాత ఆ చాకలివాళ్ళ తెలివికి నిర్ఘాంతపోయి "ఎవరు చెప్పేర్రా? మీకు నేను విద్యావంతుణ్ణి" అని అడిగేరు "ఎవరు చెప్పాలి బాబూ! మా బ్రతుకు దెరువు చెప్పిం" దన్నారు. అలా అనకపోతే మా బుర్రలు పగిలి పోవడమే అయియుండేదీ పాటికావూళ్ళో." అన్నారు.

"విద్యావంతులు అంటే ఆ గ్రామంలో అంతగౌరవమున్నా. ఉద్యోగస్థులంటే అంత ఆతతాయితనమూనా! ఏవూరు అది!" అని అడిగేరు వెంకయ్యగారు. "పెద్దూరు" అన్నారు శర్మగారు ఎదురొస్తూ. .



| | | |
|---|---|---|
| రచన | స్ఫురణ | తొలిప్రకటనము |
| 24-11-1982 | కోనసీమ | "వినోదిని"లో |

# 3

# శాఖాపంతులుగారు

---

ఉన్నదున్నట్టు, జరిగింది జరిగినట్టు, వ్రాద్దామని సంకల్పించుకున్నానీతడవ. ఎంచేతా అంటే—కల్పించుకొంటూ ఎన్ని వ్రాసినా ముక్తి మోక్షం లేకనిపించడం వల్లను, మరీన్నీ చదువరులూరకే ఆ అబద్ధపు కల్పనాలు చదివి "నిజంగా జరిగిందేనా అండీ" అని అడిగితే "లేదోయి అబద్ధమే నిబద్ధిగా కనబడేటట్టు వ్రాసేనోయి" అని బుకాయించవలసి వస్తూండడంవల్లను, ఇంతకూ ఒక్క సత్యము తులనిడి దూచిన అన్న పద్యములో చెప్పినట్లు ఒక్కసత్యముతో సరైంది, నైతికశాస్త్రమందేమి ధర్మచర్చలందేమి, వేదాంత గోష్ఠియందేమి, లేదని చాటడం వల్లను - ఇన్నివిధాలుగా మనసు కుదుట పరచుకొని నేటికున్నదున్నట్టు జరిగింది జరిగినట్లు వ్రాద్దామని సంకల్పించు కున్నాను.

అయితే ఆమార్గ మనుకొన్నంత సులువు కాదనిపిస్తోంది. బ్రతికున్న వాళ్ళనుగూర్చి యున్నదున్నట్లుగా వ్రాస్తిమా— వాళ్లకు కులుకుం సెడి యులుకు రావడమే కాకుండా వ్రాయసగాని మీద పరువు నష్టపువ్యాజ్యాలు బనాయిస్తారు. అంచేత ఈవ్యక్తి రచనలన్నీ మృతులైనవాళ్ళను గురించే రచించాలి.

మహాత్ములైనవారు పెళ్ళికానివారైయుండాలి, పిల్లల్లేనివారై యుండాలి; లేకపోతే వాళ్ళ కీర్తిశేషులుగా, గీర్తించక వ్రాస్తే యీ పెండ్లాంబిడ్డలు కలివొస్తారు. మెటికలు విరుస్తారు. అతగాడా స్త్రీలేనివాడై యుండాలి. కాకుంటే చదువరు లా స్త్రీయెక్కడుంది? వానికాపురా స్త్రీ యుందెట్టిహాక్కుంది? ఎవళ్ళూ లేకపోతే అదెవరికి సంక్రమిస్తుంది? వ్రాసేవిరాకా! చదివేవారికా? లేకుంటే సర్వాం సహాయుస్వాహా అంటూ నిర్మాణమైన ప్రభుత్వం వానికా? అనే దురూహాల్లోకి దిగుతారు. మరి బొద్దూ పొడుగూ అందం చందం లేనివాడవాలి అలాకాకపోతే వాని యొక్క సూక్ష్మదేహాన్ని గురించి యోజిస్తూ, అంత్యవిరహం లో అంతరబరూ పమున్న అప్సరసలు, గంధర్విణులు, కిన్నెరసానులు, నాగాంగనలు, నరాంగనలు, అంతావొక్కమాటుగా జట్టిలోబడి, గొల్లుమంటూను. అందేత ఎన్నోమినహాయింపులు చూచుకొని పన్నాగం కాకుండా, ఉన్నదున్నట్టు జరిగింది జరిగినట్టు వ్రాయడమనేదుందే అది బహుప్రయాస.

అందుకే అందరూ ఇట్టిట్టే తమమోహ మోహాసక్రీడ ఘట్టంగుండా నెలిబుచ్చుకొని, తమశోక మో సీతమ్మవారి వనవాస గాథలాగ రోదించుకొని, తమ విరాగమోహక మహర్షియమాయక రూపంద్వారా ద్విగుణీకృతం చేసికొని, అసలు సంగతి తేలక అన్నివిధాల అన్వయకాఠిన్యాలకు అర్థాంతరన్యాసాలకు రాద్ధాంత సిద్ధాంతాలకు ఎడమిచ్చేరు. ఆపంథకు అడ్డుతగిలేవా

లేవరూ ఉండరు. చిత్తం వచ్చినట్టుగా చిక్కం అల్లినట్టు అల్లెయ్యొచ్చును.

అందుచేత నాయీ ప్రస్తుతభారం, సత్యంమీాద ఆధారపడ్డది అయినప్పటికిన్నీ, తత్వంమీారంతా చదివే వాటంత సులభంగా రచింప బడ్డదికాదు.

అహా! జ్ఞాపకం తెచ్చుకోగా తెచ్చుకోగా కనిపించేడో మానవుడు. —* శాఖాపంతులుగారు. పొడ్డికాళ్ళు! మొగమ్మీాద్దో కంతి! – పెళ్ళిలేదు. పెటాకుల్లేవు! బెత్తెడుభూమి లేదు- బతికినన్నాళ్ళూ కత్తిరికోంపే.

అయితే వారింటిపేరు శాకావారా శాఖావారా? అనే వితర్కించుపోలేను. ఉన్నదున్నట్టుగా వ్రాస్తూ వున్నానుగానీ. శాకావారనీ తోస్తుంది శాఖావారనీ తోస్తుంది. శాకావారని యనుకోవడానిక్కారణం ఆయన శాకపాకాదుల విషయంలో మిక్కిలి నిక్కచ్చిమనిషి. పనసకాయ సంపాదించినాడా అంటే పీటచెక్కమీాద నిలుచుండబెట్టి, దానిచెక్కులు చెక్కడం కాణ్ణుంచి, పొట్టుకింద చితకొట్టి, ఆవపెట్టి, కరివేపాకువేసీ పోపులో నూని చాల్నంతోసి, రుచిచూసి, మహాబాగావుంది అని అనుకొని తినేసేదాకా మఱి వీధిలోకి రాడు. అందుకోసంగా అమేషా ఓ కత్తి ఓ పసుపుడబ్బా, ఓ బంకగికే అట్లకాడ, ఓ నూనిసిద్దీ అన్నీ ఓమూాల అమారుగా వుండేవి

నిత్తైమూ. మరి అందునుగురించి అతని ఊహా స్వాతంత్ర్యం ఎంతవరకూ కొమ్మలు మెలితిరిగి పోయిందంటే—ఓనాడొకరు "అయ్యా! కొన్నాళ్ళు చంద్రుడు కనబడక, అన్నీ చుక్కలే కనబడతాయి! యేమిటండీ దాని సాంకేతికం?" అని అడిగినారట. అడిగితే యీయన జవాబు చెప్పేట్ట—శచీదేవి యింద్రుని నిమిత్తార్థమై పచనం కోసంగాను ఇంద్రుణ్ణి కూరా?" అంటే చంద్రుడనే పనసకాయ దెచ్చి అందులో ఉన్న నలుపు ముచిగ్గా పైకెగలాగి పట్టి తన వజ్రాయుధంతో చకాచకా పొట్టుగా కొట్టి పెళ్ళాం కిచ్చేట్ట. ఆ కొట్టినప్పుడు చెల్లా చెదురై విరజిమ్ముకు పోయిన కొంతపొట్టే యీ కనవచ్చే చుక్కలూ" అన్నాట్ట. దానిమీద సందేహ నివృత్తి కానివాళ్ళు "పనసకాయ నలుపా తెలుపా, చంద్రుణ్ణి పనసకాయ అనుకోవడం ఎట్లా తటస్థించింది?" అంటే "ఐరావతం ఆదిశేషువు తెలుపు. ఇంద్రజాల శాస్త్రంలో అన్నీ తెలుపే" అని "ఇంతకూ పనసకాయ తెచ్చి మాట్లాడుతున్నావా? తేకుండా మాట్లాడుతున్నావా? తేకపోతే వెళ్ళిపో. నా ముందుండకు; నన్నేమీ అడక్కు; వేదంలో చూచుకో ఆ పేరు కనిపిస్తుంది" అనేవాట్ట. దాంతో ఎంత వాదించేవాడైనా తోక ముడుచుకు పోయేవాట్ట. దానాదీనా ఆయనకు శాకాహార ధురీణుడని బిరుదిచ్చి వారింటిపేరు నాటి నుంచి శాకావారని అనేవారు. అది శాకావారే గని

శాఖావారు కారని కొందరి వాదం. మఱికొందరి వాదం వారిది చెప్పన్న శాఖల్లోను ఓ శాఖైన ప్రథమశాఖ అని, వారొన్నానాడెవరో "అయ్యా! మీా దేశాఖండీ" అంటే "పప్రథమ శాఖ" అని "క్ష" "ఖ" రెండక్షరాలు 'శంఖం' 'సిద్ధం' ఒత్తినట్లు ఒత్తేట్ట. అప్పట్నుంచి ఆయనకు శాఖాభిమానం మెండు అని ఆయన కంఠుకువిషయమై వారి శాఖ వారంతా ఓ సభ చేసి "శాఖాభిమాన మహామహిమాఢ్యుడు" అనే బిరుదిచ్చి వారింటిపేరు నాటినుండి శాఖావారుగా చేసియున్నారని మఱికొందరి వాదం. ఈ వాగ్వివాదాలూ వితర్కాంపులూ విడిచిపెట్టి ఉన్నదున్నట్టుగానూ, జరిగింది జరిగినట్టుగానూ భావిస్తే కనబడేదివేఱు. ఆయన మొలనెప్పుడూ ధగధగలాడిపొయ్యే బత్తాయి చాకు వుండేది. ఆయన్నెవ్వరైనా పలకరించాలీ అంటే ఆ చాకునుబట్టి ఆయన్ను గుర్తించి "చాకాయన" అని పిల్చేవారు. అసలింటిపేరూ పేరూ ఎవరికైనా చెబితేగా మహానుభావుడు—చాకాయన అనేదే ప్రథమ మీాద కచటతపలకు గసడదవలు వచ్చిన గరుణాలోనో లేక పోతే తూర్పు జనం ఏసగా మాట్లాడే సందర్భాల్లోనో సాకాయన అయ్యేది. మఱి ఛాందసులు ప్రతీదానికి, ఒత్తి వకారము, శకారము, కరాదాముడు ఇచ్చే పద్ధతిలో శాఖాయన అయ్యేది పేరు పంతులుగారని సర్వసాధారణంగా గద్వాల సంస్థానపు విద్వాన్ నుండి వీధిబడి పంతులు వఱకు లాతిమనిషి పిలవబడ్డం మన తెలుంగు దేశంలో పరిపాటే.

ఏవం విధంగా నామకరణ మహోత్సవం జరిపి శాఖాపంతులుగారి జీవిత సంగ్రహ ముఖ్యోద్దేశిత చర్యను గుణించి చాటించేం. ఓ చదువరులారా! ఆయన జీవితంలో జ్ఞాపకం వుంచుకోవలసినవి రాజకీయంగా గాని, ఆర్థికంగా గాని, అంతరంగికంగా గాని, బహిరంగంగా గాని, ఆధ్యాత్మికంగా గాని, సహింకగా గాని, ఏమీ కనిపించవు—నిరాడంబర మహర్షుల్లో నిరాడంబర మహర్షిమల్లే, నిర్లిప్తుడు, నిరవశేష విజ్ఞాని, నిర్మలినుడు, నిరహంకారుడు—అంచేతనే ఇంత నిత్తె సత్తెంగా వెలిసిపొయ్యేడు. ఒక్క సంగతే ఆయనకు తెలుసును. ఆ ఒక్క సంగతే ఆయన అందర్నీ చేయమనేవాడు.—

అసాధారణమైన ఆశ్చర్యంతో ఈ అనంత ప్రపంచ నిర్మాణ మండలి యేపదార్థమునూ చూడాలనేవాడు. తననోరు విప్పుకొని కళ్ళుప్పళించుకొని నిర్ఘాంతపోతూ దర్శించేవాడు. ఓ మామిడి చెట్టు చిగురు పట్టిందనుకోండి ; లేదా పూత పూసిందనుకోండి ; మన యీ నరుడు ఆ తోటడ్డమడి పోతూపోతూ ఆ చెట్టు కేసి అట్టే నిశ్చేష్టుడై చూస్తూ, తనలో తానే, ఎవరు లేకపోయినా ఎవరితోనో అన్నట్టుగా ఆహా! ఎంతబాగా చిగిర్చింది! ఎంతబాగా పూసింది! ఆహా! ఆహా! ఆహా! అని అక్కడో కాస్సేపటి కేవరైతేనా కంటబడ్డా "సామీ! ఓయి రామసామీ! చూడు ఆ చిగురు చూడు! ఏం చెట్టోయి! ఆ పూవు చూడు! ఏంపూలోయి! ఎంతందంగా

చిగిర్చింది ! " అని అతనుకూడా తనతోపాటు చూచేదాకా పురిగొల్పేవాడు. ఓ కొండ దగ్గరున్నంచి పోయేవాడనుకోండి. ఆ కొండదిగు భాగంనుండి పైశిఖరందాకా ఓసారి తన దృగం చలాల్లో కుంచెట్టి పొగినిసట్టు ప్రామేసేవాడు. ఇటూ అటూ కొండనీడను పరికించి మళ్ళీ కొండకేసి చూసేవాడు. చూచి " ఆహా ! కొండ ! కొండ ! కొండ ! ఎంత యెత్తుంది ! ఎంత దృఢంగా వుంది ! ఎంతసిడ ! ఎంతనీడ ! ఆహా ! ఆహా ! ఆహా !" అని తా సృష్టించి అక్కడ దాన్ని, తాం బ్రతిష్టించి నట్టుగానే తండ్రైనట్టుగానే గబగబా యెక్కిపోతూ ఎగిరిపోతూ పైని నిల బడి చుట్టూ చూచేవాడు. మళ్ళీ ఆ చూపులో మళ్ళీ కొత్త కొత్త చిత్రవిచిత్ర దృష్టి పరిపుష్టి ! చిట్టచివర కతగాడావింత చర్యవల్ల ఎట్లాగ్గా లోకంలో పరిణమించి పొయ్యేదూ అంటే — లోకమంతా అతగాణ్ణి వింతగా చూస్తూ " ఏంమనిషి ! ఏం వింతయితగానిది ! ఏం కొత్తపుంత! యితని పంథ! ఓహో !" అనడం ఎక్కడ చూచినా మారు మోగిపోయింది. అతగాడి యశస్సు, అతగాడి ఆశయము, అతగాడి సందేశం, అతగాడి ఆదేశం, అన్నీకూడి గుణించి తీసేసి భాగించి నికరం తేలిస్తే తేలేది ఒక్క మాట. " వింత " అనే ఒక్కమాట! విపరీతంగా వింతపొయ్యేడు.

తుదకావింత ఎంతపనిచేసిందో వినండి! ఒకనాడర్థ నిశీథినీ సమయంలో — కాళరాత్రి — కాళసాలతమాల హింతాలాది

మహామహీజ జాలంబులనూచుచు, కాక ఖేక ఘూక బలాక పికశారిక కీరమయూరగృధ్ర గండభేరుండ ప్రముఖ సమస్తాండ జంబుల నూచమట్టుగ నేలగూల్చుచు, గర్భనిర్భేదకంబగు గర్జనంబుతో, దర్జనిభంగి ఝుళిపించు క్రొమ్మెరుంగుతో సాంద్ర జలదంబులిళ్లపయిని మళ్లపయిని నేళ్లపయిని సముద్రపుంగర్లపయిని కాలకూట విషంబునుంగురియ, మహాభయంకరంబుగ వీచుప్రచండ ఝంఝానిలంబెగయ, వైహాయసవీధినుండి మహీస్థలి కంట తమోరాశినా ద్రోసికొని మూసికొని రోషిల్లినది. ఏది! కాళరాత్రి లోకానికాచీకట్లో తెలియకుండానే పెండాలు పెంకులుసహా, గోడలు గుమ్మాలుసహా ఇళ్ళన్నీ కాళీ యిచ్చి వేసినాయి.

కథలో పంతులుగారు గుడ్లుపైకిదేల్చి నోరావలించి వేసినారు ... ... ...

తెల్లాజేసరికంతా నిర్మలంగావుంది. సూర్యోదయం మామూలు సూర్యునిద్వారా కాకుండా మజ్రోక్రొత్త సూర్యుని గుండా అయినట్టయింది. పదిమందీ పంతులుగారి చుట్టూమూగినారు. పంతులుగారు పక్కకు తిరగడంలేదు, పలకడంలేదు - ఉన్నదున్నట్టు జరిగిందిజరిగినట్లు చెప్పడమేకాబట్టి చెప్పేస్తున్నా. పంతులుగార్కి పైని నిరూపించిన అనుకూల కాలాగమనంతో పాటు మృత్యుదేవతా సందర్శనం లభించింది. లభించినవెంటనే సమాజాశ్చర్య నిమగ్న ఓత్తైకాగ్ర గణ్యాడాటచే " ఆహా మృ

త్యువు! ఏమిమృత్యువూ! ఎటువంటి మృత్యువూ! ఓహో మృత్యువూ!!! అని అదే అనుకోవడం అదే అనుకోవడం. ఆ అనుకోవడం అభినయించు కోవడంలోకి మారేసరికి నోరావలింపున్నా కళ్ళు తేలించున్నా కలికి అంతకంటే తానదివఱకుగన్న దృశ్యంగాని ఇకగనఁబోవు దృశ్యంగాని మఱెక్కడ వింతగున్న దేదీలేందాబచే తేల్చినకళ్లు తేల్చినట్లేవుంది. శరీరస్మృతి తప్పి కాళ్లుచల్లబడి వాళ్ళిగమై చివరకు గాలి లోగాలి ఏకముగాఁ బరమపదించినారు.

జనుల్లో కొంత తడవుదాకా ఆ నరుడింకా జీవించియుండి దేనినో ఆశ్చర్యంగా చూచుచున్నాడనే యభిప్రాయం. ఆ మీమాంసతో అపరాహ్ణం తిరిగిపోయినా ఊళ్లో వంటల్లేవు. భోజనాల్లేవు కొంతసేపటికి ఓ మహాత్ముఁడు పైనుంచి అవతరించినట్టుగా ఎక్కణ్ణుంచో దిగినవాడై "వెఱ్ఱి ప్రజల్లారా! ఉన్న దున్నట్టుగానూ జరిగిందిజరిగినట్టుగానూ యోజిస్తేయెన్నాళ్లకూ సంశయ నివృత్తిగా నేరదు. మీరేమో అతని శరీరమింకా దేనినోగూర్చి దేనినోయేల? మృత్యుదేవతను గూర్చియే కానిండు సహజాశ్చర్యచిత్రకాగ్రగణ్యత దిలకించు చున్నాడని యనుకొనుచున్నారు కామోసుఁ ఆఆశ్చర్య మన్నదంతా ఆత్మదిగాని యీ శరీరముది కాదు. మనము లేనిది లేనట్టుకూడా తెలుసుకోవాలి; యీశరీరం లేనిది ఆత్మ మాత్రమే యున్నది. కాబట్టి ఇతడు పొందిన, పొందు

చున్న పొందబోయ్యే దూవవాశ్చర్యమూ ఆత్మపరంగాని శరీర పరమెంతమాత్రంగావు. కాబట్టి యీ శరీరమున కుచితదహన సంస్కారాదులొనర్చి యితని యాత్మకు శాంతిసెప్పి కొనుచు మీరు పప్పూ కూడా భుజింపుడు అని హెచ్చరించేను. అదిగో చితి ! అదిగో మృతి ! ఓం తత్సత్ !



| రచన | స్ఫురణ | తొలి ప్రకటనము |
| --- | --- | --- |
| 13-12-1932 | లక్ష్మీనర్సాపురం | " వినోదిని " లో |

# ౪

# శృంగారశ్రేష్ఠి

శృంగారశ్రేష్ఠి అనఁబడే యొకానొక వైశ్యకులావతంసుఁడు వైశాలీ నగరమందు గాపురంబుండేడు. అతణ్ణి ప్రజాసామాన్యం 'అంగారః, ఇంగాలో, ఇంగలం,' అని వైయాకరణులు మార్చి చెప్పేలా 'శృంగారశ్రేష్ఠి' అనలేక 'సింగారపు చెట్టి' అనీ మఱీమార్చి 'సీంమిరప సెట్టి' అని పిలువడం కద్దు.

ఈ మార్పు సరైందా అక్షరాల కక్షరాలే ఎగిరిపోయినవని ఏ వైయాకరణుడైనా అడిగేటట్టయినా, ఆ ప్రజలిట్టే సమాధానం చెప్పగల సమర్థులు. ఏమని? "మిరపలో కారంలేదా!" అని సెట్టి మిరపకాయలమ్మడా అని - ఏదైనా తచ్ఛ్రేష్ఠికి 'సీంమిరప సెట్టి' అని తన్నెవరన్నాగానీ కోపంలేదు. ఉడుకుమోత్తనం లేదు. ఆ పేరుయొక్క ఆది సంస్కృతమైన 'శృంగారశ్రేష్ఠి' అనేనామంతో తాను పిలవబడాలనే బింకంలేదు. పంకంలేదు. ఇంతెందుకు 'సీంమురప సెట్టి' అనేదే సొంత పేరనీ, ఎవరైనా 'శృంగారశ్రేష్ఠి' అంటే అదేదో అని అతగాని నమ్మకం. - ఈ వితర్కింపు అనవసరం కూడానూ. ఎవరూ 'శృంగారశ్రేష్ఠి' అని అతణ్ణి పిలిచినవారే లేరు. అంతా 'సీంమిరపసెట్టి' అని పిలవటమే పరిపాటి.

ఒకమారు ఓ యాచకపండితుడు ఆ శ్రేష్ఠివద్దకు సంభావనకై వచ్చి యడిగి యడిగి విసిగి వేసారి సాహసకారుగా రేమీ ఇయ్యక పోతే 'సెహామ్మ పణ్యస్త్రీలకేగాని మాబోటి పుణ్యాత్ములకు గావు కాబోలు' అన్నాడు. సింమిరపసెట్టి చివాలున లేచి "పణ్యస్త్రీలకూ లేదు. పుణ్యాత్ములకూ లేదు నాసొమ్ము నాదే పోవయ్యా! బాపనయ్యా! ఏమాత్రం సంస్కృతం నాకు రాద నుకున్నావు గావాలు! పణ్యస్త్రీ అంటే భోగందేనా! నావొంక నూనే భోగందానరూ! ఉప్పూ సింతపండూ అమ్ముకుండే సెట్టి ముండాకొడుకని" అన్నాడు. లోపలకు బొడ్డుపోనిచ్చి కొంతు అదో బొంగురు వ్రమాతెట్టేటట్టు.

సరే అని ఆ యాచకుడు వెళ్ళిపోయినాడు. వెళ్ళిపోయి యా యూర మరో పేటకు బోతూ చక్కని ఓ భోగందానింటికి వెళ్ళి సంభావన తీసికొని "శాస్త్రులుగారూ పురాణం కొంచం సెలవియ్యండి విన్నాలనివుంది." అని అంటే "అస్తి వైశాలీ నగరే శృంగారశ్రేష్ఠి వైశ్యః" అని చదివేడు. భోగంది "మావూళ్లో శృంగారశ్రేష్ఠి పేరున్న వైశ్యుల శిఖామణే! ఎప్పుడూ కళ్ళార చూడలేదండీ? వింతగానుంది" అంది. అని శ్రేష్ఠి ఇల్లూవాళ్లూ ఆనవాలుగా తెలిసికొంది. తెలిసికొని లోలోపల "సింమిరపశెట్టి యింతవాడా? శృంగారశ్రేష్ఠా!" అని యుబ్బిపోయి పండితుణ్ణి పంపించివేసి తానెలాగన్నా సింమిరపశెట్టిని తనవలలో పడేసుకొని శృంగారంమాట ఎలావున్నా శ్రేష్ఠి సిరికొల్లగొని పెద్దమేడ కట్టాలనుకుంది.

భోగం దోమామోలు లంగా కట్టుకుని యుత్తప్పు డగపించే సామాన్యపుదానిలాగు ఎవరూ అట్టే తనకేసి చూడని మచ్చుగా, చిల్లఱ దుకాణం మీదికి శొంఠికొమ్ము కొనుక్కోవడానికి వెళ్ళినట్టుగా వెళ్ళింది శ్రేష్ఠికొట్టుకు. శ్రేష్ఠి కూర్చుని యున్నాడు. తన అరిగరిగిపోయిన ముక్కాలిపీటమీద నిట్టేట్ట జాఱుతూ సరుకు లందుకుంటూ అందఱికీ అడిగినవాళ్ళకు లేదనకుండా యేదో యొక పొట్లం కడుతూ, యేదో నూని డొక్కులో ఎగతోడుతూ. భోగంది సెట్టి కొట్టు దగ్గరకొచ్చి "ఒక డబ్బువి వేలగ్గింజలిస్తురూ సెట్టిగారూ!" అంది. "ఆఁ ఆఁ అబ్బే! సానిగారు మా కొట్టుకొచ్చారు. సొంతంగా వచ్చారు. తాంబూళంలోకా యేంటి వేలగ్గింజలు—గింజ లేం? కాయలట్టుకెళ్ళు." అన్నాడు. భోగంది "మీరేం కట్టిస్తే అవే పట్టుకెడతాను—కాని సెట్టిగారూ! మిమ్మల్నిదాకా సేం మిరపసెట్టిగారనే అనుకొన్నా. శృంగార శ్రేష్ఠిగారు కూడానే!" అంది. "ఊఁ! ఊఁ! ఎవరు సొప్పారు? బుల్లీ! సీకెవరు సొప్పారు!" అన్నాడు సెట్టి. భోగంది "ఒకరు సొప్పడమెందుకు? తెలదూ? మీ ముఖంలో శృంగారచేష్ట విరిసిపోతూంది" అంది. "ఊఁ! ఊఁ!" అని కళ్ళు చికిలించుకొని శ్రేష్ఠి తులమున్నర ఏలకా.. యలు పొట్లంకట్టి భోగందానికిచ్చి "పట్టుకెళ్ళు. పట్టుకెళ్ళు" అని ఆ చేయి తాకుతూనూ పరవశమైపోయి 'వెళ్ళు' అన్నాడు. లోపల్నుంచి సెట్టి

భార్య చూస్తూ "డబ్బులు పుచ్చుకోవడం మరచిపోయినా రా అమ్మ దగ్గర" అంది. సెట్టి వేశ్యను "చిన్నమ్మా" అని వెనక్కి పిలచి "డబ్బులీ లేదేం?" అన్నాడు. వేశ్య అంది "మీకొట్టు దగ్గరకొస్తే గాని నాకు మీరు సరుకు ఇచ్చినారా! అలాగా మా యింటికొస్తే గాని మీకు మా డబ్బులు రావు" అని అంది. అంటూ వెళ్లిపోయింది.

సెట్టి భార్య లోపలనుంచి గావుకేకగా "ఓలమ్మా" అని పిలవడానికి నోరు తెరిచింది. కాని సెట్టి తన భార్య నోరు నొక్కి "అది బోగం దే. కేకేయకే. నేపట్టుకొస్తాను డబ్బులెలాగో నేపట్టుకొస్తా" నన్నాడు. సెట్టి భార్య "ని తెలివి మండినట్టే వుంది. బోగంది వీధంట వెడుతూంటే మగాళ్ళు పిలవకూడదు గాని ఆడాళ్ళు పిలవకూడదూ!" అంది. "నీవు పిలిపినా నాకోసమే అనుకుంటారే యెట్టి మొకమా!" అన్నాడు సెట్టి. అని వారించి లోపలకు వెళ్లదలిమాడు పెళ్ళాన్ని.

సెట్టిప్పుడు అదివరకు బోగందానింటికి వెళ్ళేవాడు. మళ్ళీ బోగంది సెట్టికొట్టుదగ్గరకు రాలేదు. సందెలిడత సెట్టి గోవ తాడు మొలనెట్టుకుని, మురిడీగొలుసులు చేతులకుంచుకొని— రెండూ బంగారపు వస్తువులే—గంజిబిగి జల్తారుకండువా పైని వేసుకొని, ఆ బోగందానింటికి బయలుదేరేడు. ఎవరన్నా "ఎక్కడికి సెట్టిగారూ గబుక్కుగా వెడుతున్నారు!" అంటే బాకీలు వసూలు చేసుకోడానికి అంటూ వెళ్ళినాడు.

భోగంది తన పీఠకుకుమీద అదోలాగంగా కూచుంది. తలకట్టు "విగ్గు" పాపిడల్లే తీసుకొని, అటూఇటూ విరబోసుకొని, మొగాన్ని పౌడరు వేసికొని, వల్లెవాటుగా ఉల్లిపొర చీరకట్టుకొని, ప్రైకలేసుంటా కూచుంది. సెట్టి అంతదూరాన్నుంచి చూసేడు. కళ్ళు చీకట్లు కమ్మిపోయినాయి సెట్టికి. ఒకమాటు కళ్ళునలుపుకొని తనకేసి చూచుకొని దానికేసిచూచి ఆశ్చర్యపోయి "సెస్! దాన్ని, 'ఓకబ్బు బాకీవున్నావు నీవు' అని అడగడమేమిటి అని అనుకున్నాడు. అనుకొని వెనక్కితిరిగి, వచ్చినదారినే పోబోయినాడు. భోగంది "ఏం శ్రేష్ఠిగారూ ఇదాకావచ్చి మళ్ళీ పోతున్నారు!" అంది. "పొద్దున్నదబ్బు" అన్నాడు సెట్టి. "ఏలక్కాయల డబ్బేనా!" అంది. "ఊ! మహా సెడ్డగాపకం నీకుసిన్నమ్మా!" అన్నాడు. "అయితే శ్రేష్ఠిగారూ! పొద్దున్నే అడగాలనుకున్నాను—శ్రేష్ఠిగారూ: నా పేరు చిన్నమ్మ అని ఎవరు సెప్పారు!" అని అడిగింది భోగంది. "సెప్పేదేంటి. మాయింట్లోదాని ముందు నీవు సిన్నమ్మలా కనిపించేవునాకు. దానికి వొకరు సెప్పేదేంటి? చూస్తే తెలీదూ?" అన్నాడు. "అయితే, డబ్బుకోసమే వచ్చింరీ!" అంటూ లోపలకు తీసుకొనివెళ్ళి డబ్బు చేతిలోపెట్టి, "మాయింటికొచ్చారు. తాంబోళం సేవించరూ!" అంది అని అరమోదాకుల్లో అన్నివక్కలు, అన్నిలవంగాలు అన్ని ఏలక్కాయలు, జాపత్రి, జాజికాయముక్క, కవిరి, కాచు,

అన్నీ వుంచి ముందుబెట్టింది. సెట్టికి గుండె తాళలే. "ఒక్కడబ్బు ఖరీదుగల ఏలక్కాయ ఉచ్చుకుంటే దానికోసం తల్లడిల్లిపోయువచ్చేరు. మాయింట ఏమీలేవనా? అయితేంలేండి. మీడబ్బు మీకిచ్చేసి మీఋణాన్ని పడుండకుండా పైకి తేలేను." అంది బోగంది. అంటే సెట్టి "ఏలక్కాయలుంటే వుంచేని. గంధంవుందీ! అత్తరువుందీ!" అన్నాడు. బోగంది "గంధంవుంది" కాని అని మురిడీగొలుసులకేసి గోవతాడుకేసి చూచింది. సెట్టి "ఈ వస్తువు లుచ్చుకుందామనే? సీతస్నానొయ్య! సీతస్నానొయ్య" అన్నాడు. బోగంది "కాదండీ! గంధంపూతకడ్డని" అంది. అయితే తీసి యెక్కడ వుంచుతావో వుంచు" అని సెట్టి తనఆభరణాల్ని అదే తీసివేసేలాగు తనవాళ్ళొగ్గేసేడు. బోగంది గోవతాడు మురిడీగొలుసులు తీసి జాగ్రత్తగా వేజేవుంచి, సెట్టికి గంధం పూస్తూంది. అత్తరువు రాస్తూంది. మైమఱచిపొయ్యేడు సెట్టి.........బోగందింకా ఏమేంచెయ్యాలో అన్నీ చేసింది.........అంతాఅయిపోయినాక "ఎళ్ళొస్తా చిన్నమ్మీ!" అని మురిడీగొలుసులమాట గోవతాడుమాట పరాకుపడి, యింటికుత్సాహంగా వచ్చేసేడు.

సెట్టి యింటికివచ్చేసరికి పండితుడు సెట్టి ఇంటిఅరుగుమీాద కూర్చుండి సెట్టిభార్యకు పురాణంచెబుతూ ఆఖర్కు వచ్చేసి "స్వస్తిశ్రీ పరిపాలయంతాం" అంటూ ఓ కొత్తకాసిమ్మన్నాడు. "సెట్టిభార్య ఉండండి. మావారొస్తారు" అంది.

అంతలో సెట్టివచ్చాడు. "ఆ భోగందాని అరువుడబ్బు ఈ బ్రాహ్మడికి ఇలియూవేయండి. పట్టుకుపోతాడు" అంది సెట్టిభార్య సెట్టితో. సెట్టి "అవోసూత్రైంది. నాకే వసూత్రైందే" అంటూ డబ్బుకోసం మొలతడుముకుంటూ, మొలని తనగోవతాడు కాక, సెట్టి నిర్ఘాంతపోతూ ముచ్చెమట్లు గార్చేడు. అంతేనా? నిలువునా ప్రాణా లొదిలేస్తూ వృద్దాప్యైనా అట్లట్టు కొయ్యబారి పోయినాడు మనిషి. సెట్టిభార్య "ఏమిటండీ పండితులవారూ!" అని అడుగ బోతూ ఏడవబోతూవుంటే పండితుడు "అస్తి వైశాలీనగరే చిన్నమ్మినామిస్వా వేశ్యా" అన్నాడు. "అదే నాకొంపదీసిం" దంటూ సెట్టి గుండెపగిలి—

బ్రాహ్మణుడు అక్కడుంటే తనకు మాటదక్కదనుకొని లాభం చిక్కదనుకొనిపోతూపోతూ, భోగంది, దానిగుమ్మంలో నిల్చునివుంటే-రాత్రిభాగం—"నాస్తి వైశాలీనగరే శృంగార శ్రేష్ఠి వైశ్యా" అన్నాడు. "ఏం" అంది భోగంది. "గుండెపగిలి పరమపదించేడు ఇప్పుడే" అన్నాడు బ్రాహ్మణుడు దానితో. "డాక్టర్లన్నమాటేనా!" అంది భోగంది. "కాకపోతే నీచేతుల నలా మెఱుస్తాయి శ్రేష్ఠి మురిడీగొలుసులు? నీమొలనలా శ్రేష్ఠి గోవతాడూ?" అన్నాడు బ్రాహ్మణుడు. అంటూ దాని వంక అదేమాపుగా జూచేడు ప్రాథేయపూర్వకంగా—భోగంది ఆనాడు తానుసంపాదించిన మురిడీగొలుసుల్లో వొగొలుసు ఆ

బ్రాహ్మడికిచ్చి, రెండో గొలుసూ గోవతాడూ చేతిపించి సెట్టి పేర నో చంద్రహారం చేయించుకోవాలంటూ పండితుణ్ణి లోపలకు పిల్చుకొని ఓముద్దెట్టింది, "ఇందుకోసమేనా ఆలా చూచినావు?" అని. బ్రాహ్మణుడు "చంద్రహారం నాపేర చేయించుకో" మని చెప్పడానికంటూ దాన్ని తిరిగి ముద్దుపెట్టుకునేడు, "అవును పండితచంద్రా" అని బోగంది "హారము" అనకుండానే.

గుండెపగిలి - శృంగారశ్రేష్ఠి నిజంగా ఏమయ్యేడో...... పాపం!



| రచన | స్ఫురణ | తొలిప్రకటనము |
|---|---|---|
| 7-8-1981 | నరసాపురం | "వినోదినిలో" |

X

# ఆకుపచ్చ రంగు

సాయంకాల విహృతులందు స్నేహితులూ నేనూ వివిధాంశాలమీద వ్యాఖ్యానాలు చేసుకొంటూ పోతూంటాం. అలాటి ఓసందర్భంలో కొన్నాళ్ళైనే నన్నాదేమీలేదు "ఇప్పుడాడవాళ్ళక్కట్టే చీర్లరంగూ రైకలరంగూ చూచేరా? అంతా ఆకుపచ్చ మయంగావుంది. కొన్నాళ్ళక్రింద ఎక్కడచూచినా నారపట్టుసిగవిగ. అదిపోయి యిదొచ్చింది" అన్నాను. నేనన్నది నేనప్పుడే మఱచిపోయినాను. మళ్ళా రోజూ ఆడవాళ్ళలాంటి రంగుచెంగులూచుకొంటూనే పోతున్నారు రాజమార్గాన్నే. కాని నాకాయూసే లేదు. నామిత్రునకది మనస్థగితమై పోయింది కామోసు. మఱి పదేనురోజుల కడిగేడు "ఏమోయి నీవన్న మాట నిజమే. ఈ పదిహేను రోజుల్నుంచీ చూస్తున్నాను. ఎక్కడచూచినా బీదవాళ్ళనుంచీ భాగ్యవంతులుదాకా ఆకుపచ్చచీరలూ ఆకుపచ్చ రైకలేనోయి!" అన్నాడు. "అందుకే అన్నాను" అని పరధ్యానంగా నడుస్తున్నా. స్నేహితుడు "ఏమోయి, కాదు నీకు కనువిందవడంలే ఆ అద్దకం?" అన్నాడు. నేనన్నాను "కాదు, నాదృష్టిప్పుడు—చెట్లే మఖ్యఫాల్గుణ మాసాంతానికి చిగురుస్తూ పసరరంగుతో ఓపిస్తున్నాయి

—

చూడు. ఆచాయ మీదకు ప్రాలింగోయి" అన్నాను. అంటే స్నేహితుడన్నాడు "చిలకరంగూ చీరరంగూ ఒక్కటనా?" అన్నాడు. నేనన్నాను "అంతే కాదు. స్త్రీకీ చెట్టుకీ భేదమేలే" దన్నాను. "ఏం" అన్నాడు. "అన్నీ ప్రమాణపూర్వకంగా ప్రతిపాదించాలి నీముందు. ఒక్కటీ స్వయంగా తెలిసికోలేవు" అని ఏమీ అతనికి చెప్పకుండానే నడిచేశాను ఆనాటి నడకంతా.

మరి కొన్నాళ్ళకతను "నాకేమీ నీవు చెప్పకుండానే అవగాహనయిందోయి ఓచోట" అన్నాడు. "ఏమిటేలాగు?" అన్నాను. కాస్సేపు గునిసేడు. కాస్సేపు నసికేడు. తుదకిలా అయితేం చెప్పేడే.

అతనేమో కాలవొడ్డే యాతలగట్టు నడుస్తున్నాట్ట—ఓరోజుదయం 9గంటల వేళ ఓ కుగ్రామంపోతూ. అప్పటికి రెండు రోజుల క్రిందటిమాట. ఆ కాలవేమో పిల్లకాలువట. అటూ ఇటూ గట్టంచుల పచ్చికలు మొలిచి, భూమ్మీద మొలిచినా తమ జీవనాధారం నీళ్ళేనన్నట్లు, కాలవలోకి వాలిపోతున్నాయిట గరికచివళ్ళు. గట్టుమీద యీవల నడదారీ ఆవల నడదారీకూడా సన్నగా తెల్లగా పక్కెట్టినట్టుందట. ఈవలగట్టే ఇతడు నడుస్తున్నాట్ట. ఆవలగట్టే ఓయువకుడో రెండుచక్రాల త్రొక్కుడుబండి నడిపించుకుంటూ తన త్రొక్కుడుబండి కావలగా తనతోపాటు తన బండితోపాటు చకచకనడుస్తూ

వున్న ఒక యువతితో కబుర్లు చెబుతూ వున్నాట్ట. వాళ్ళు తన కేసి చూడ్డం లేదట. చూచినా ఇతనెవరో అని అనుకొనే స్థితిలో తమ కబుర్లూ కథా నడుపుకొనే వారల్లేతోచేరట. ఇతను మాత్రం వాళ్లను గమనిస్తున్నాట్ట. మాటలస్పష్టంగా వినబడ్డంవల్ల అర్థం గ్రహించలేకపోయినాట్ట గాని నవ్వులు ముమ్మరంగా అన్యోన్యం నవ్వుకుంటూ వున్నప్పుడు మాత్రం "అహో! యువకుడు! యువతి! వారిద్దరిమధ్య తోక్కుడు బండి! విలాసము! నవ్వు! అంతా అర్థమై పోయినట్టే సంతృప్తి చెందినాట్ట. వారింకా గబాగబా నడుస్తున్నారట. తానూ వారితోపాటే నడుస్తూన్నాట్ట.

ఈలా వారూ ఇతగాడూ వెళుతూన్నకొద్దీ ఇతగాడింకా కనిపెట్టిందేమిట్రా!— ఆ యువతి యొక్క ఆకుపచ్చరేక తోడుక్కుందట, యొక్క ఆకుపచ్చరంగు చీర కట్టుకొని చీరకచ్చ వెనక్కు విడిచికొందట. ఈ చేతా ఆ చేతా బిళారీగాజులు గుత్తంగా ఎక్కించుకొని కొద్దిపాటి సద్దు చేస్తూందట. ముక్కుపుడక ఎండ పడ్డప్పుడల్లా మెరుస్తూందట. మధ్యమధ్యను స్త్రీ తొక్కుడు బండిమీద చెయ్యేస్తూ వుండేదట యువకుడు వద్దనలేదట. ఎక్కడో తాను ఏమిటనేట్టు యువకుడో తెల్లబోయాక [illegible] దూరం [illegible] సిగ్గు కెక్కి, ఓమాటు అక్కడక్కడ కనబడే దరిసెనచెట్టు పువ్వులకేసి చూస్తూ వుండేవాట్ట.

నా మిత్రుడు "ఎందుకోయి యీసొదంతా కథా సందర్భానికి రావోయి" అన్నాను. అంటే 'కథాసందర్భమే ఇదంతా' అని ముగించేడు. వర్ణన మెల్గా ముగించేను! 'ఆ సమయాన్నావరుసంతా నీవ్వుండి చూచేవా' అంటే, మేం ముగ్గురం కాలవకొనే గమ్యస్థానంగా పెట్టుకున్నాం గాని ఆపల్లె యీపల్లె ఆకొంప యీకొంప ఆ పొలం యీపొలం మా గమ్యస్థానంగా పెట్టుకొనియున్నాం అని అనుకొని యుండవు సుమా" అన్న వాక్యముతో ముగించేడు. "ఈ వాక్యం మిక్కిలి మధురంగా వుందోయి" అని కొంచ మెచ్చరించాను అసలు ముక్కతేలుస్తాడేమో నని. తేల్చడుగా! కొంటె. అందులోనూ ఆవేళ నేను కారణం చెప్పామకానని కోపం....

మానవడికలో నేను కొంచం వెనకపడ్డాను. దాంతో అతగాడు పెనక్కివచ్చి రహస్యంఅన్నట్టు "చూడు" అన్నాడు. నేనుకొంచం దగ్గఱసగా వెవొగ్గాను. "ఆ యువకుడా ప్రాంతంలో కరణంగారబ్బాయి. ఆ యువతి ఆ కరణంగారి పొలంలో కూలికి నాలికిపోతూ మఱి నాలుగురాళ్ళు సంపాదించుకొనే కుఱ్ఱదిసుమా!" అన్నాడు. "నీకెలా తెలుసు" అన్నాను. "నా భూములున్నాయి వాళ్ళూళ్ళో. ఆ భూములు చూచుకొని నేను బయలుదేఱినాను నాదారినే యూళ్ళోకియీవలొడ్డే వాళ్ళనో కలాగాగా వేళగానివేళ పొలంమీదనుంచి వూళ్ళోకి ఆవలొడ్డే వస్తున్నారు" అన్నాడు. "పగలు 9 గంటలప్పుడు ఇది

గిన సంగతింత రహస్యంగా చెప్పడమెందుకు!" అన్నాను. "అదికాదు ఇతరులెవరైనా వింటే భూములూప్పసుకోడానికి వెళ్ళినవాడి లక్షణ మా రహస్యాలు కనిపెట్టాం! అని తిడుతారు. నీవొక్కడవు వింటే తగువులేదు" అన్నాడు. "కానీ నీ పొల్లు" అన్నాను.

"వెళ్ళగావెళ్ళగా నాకో వంతెన దొరికింది. ఆ వంతెనదాటి నే నా ఆవలియొడ్డుకు వెళ్ళాను. వాళ్ళూ నేను ఒకళ్ళకొకళ్ళం తెలియకుండా ఒక మలుపమ్మటే ఊరి మంచినీళ్ళచెరువు గట్టెక్కేం. ఆ గట్టుమీద ఆయువకుడు ఆ తన రెండుచక్రాల త్రొక్కుడు బండేంచేశాడంటే ఆ పిల్లకు జేరేసి తానేమన్నా పావంచాలంటే మంచినీళ్ళకు దిగాడు.

సరిగ్గా అప్పటికి ఆయువకునిభార్య ఆరేవులో మంచినీళ్ళు ముంచుతూ వెనక్కితిరిగి చూచింది. చూచేటలికి ఆ వయసుగాడు తనమగడు. వాని త్రొక్కుడుబండి గట్టుమీద పరస్త్రీని చేరవాని యుంచబడింది.

మొగుణ్ణిచూచి పెళ్ళాంఅంది "గట్టుమీద త్రొక్కుడు బండి గట్టుమీద రావిచెట్టుకు చేరవాపి మరి మంచినీళ్ళు తాగటానికి రాకూడదూ, అలా అంటూ చూస్తుండగా దానికివ్వకపోతే" అంది. యువకుడన్నాడు "నేనివ్వలేను. నేను దానికి శేర్వమాపి వచ్చేని. అదీ ఓచెట్టేనే! చూడు! ఆ అకు

పచ్చకోక ఆ 'ఆకుపచ్చరేకా చిగురేసిన కొమ్మల్లేవుంది'' అన్నాడు.

అంతలో ఆ గట్టుమీదపిల్ల ఆ త్రొక్కుడుబండెక్కి ఆ చెరువుగట్టుచుట్టూ వలయాలు కొడుతూంది. యువకుడు "పడిపోతావు పడిపోతావు. ఆవైపున గండిగండి" అన్నాడు. అంటూండగనే పడింది. దానికాలు విఱిగింది. బండొరకపోయింది. ఎన్ని జరగాలో అన్ని జరిగినయి.

భార్యచూస్తూఅంది. "పడితేం? కాలువిరిగితేం! సుడిగాలికి చెట్లు విరిగిపడిపోవూ! దానికి ఫరవాలేదు. ఇంటికి రాండి." అంటూ తప్పించుకొని వెళ్లిపోయింది. స్త్రీ చెట్టన్న నీమాట ప్రత్యక్ష ప్రమాణంగా ఆవేళ విన్నానోయి" అన్నాడు నామిత్రుడు.

"అప్పుడైన నమ్మావా?" అన్నానేను. "నమ్మకేం చేస్తాను! నిలుచున్నచెట్లల్లా నడుస్తూన్న చెట్టుయింది. నడుస్తూన్న చెట్లల్లా త్రొక్కుడుబండెక్కే చెట్టుయింది. త్రొక్కుడు బండెక్కే చెట్లల్లా సుడిగాలికి పడేచెట్టుయింది" అన్నాడు.

| రచన | స్ఫురణ | తొలిప్రకటనము |
| --- | --- | --- |
| 18-8-1931 | నరసాపురము | "వినోదిని" లో |

౬

# తొత్తుముండ చావు

పెడనమండుగుడు తొత్తులు మాఘబహుళ చతుర్దశినాటి యుదయం వీధంటే గుంపుగా పోతూవున్నారు. వాళ్ళవేషాలు అతివికారంగాను అతివిచారంతో కూడుకున్నవిగాను వొప్పించి వయి. అయినా కళ్ళల్లో ఆవారి కలవచిన హుషారిడి ఆలాగే వున్నట్టుంది. ఆవాళ్ళ కళ్ళన్ని యిటూఅటూ ఊం తిరిగిపోతు న్నాయి. ఆ ఆపుర్దాలోనే "రత్తీ! రత్తీ!" అని మణోతొత్తు ఇంటితలుపు తట్టి "ఇంకా తొంగోని లెగలేదిది. రాత్రి ఎవడు శారసిల్లోడో?" అని అనుకొంటూ పోతున్నారు. వాళ్లవెన కనే రత్తి తలుపుదీసి "ఏమ్మరో! ఎందుకు?" అంది. "రాషే రాషే! మనకాంతం తెల్లాఱగట్ల చచ్చిపోయిందట. మోసు కెళ్ళే దిక్కున్నా లేదట. ఎల్లావున్నశవం ఆలావుందట." అన్నారువాళ్ళు. రత్తి ఆదోవిధగా మాఱిపోయింది ఆమాట వినడంతోనే—

రత్తింకా లోపలకు వెళ్ళకుండా ఆ రత్తింట్లోంచి దాని మిటుడు వీరన్న యివతలకువస్తూ "నీవు లెగిసేముందు నన్ను లెగ్గొడితేం" అన్నాడు. "ఇప్పుడేగా లెగిసింది నేను; ఇప్పుడేగా

ఇడిసిపెట్టేవు నా చెంగు! ఇంతలోనే మఱిపంత్రటా?" అంది రత్తి. అని "వీరన్నబావా, ఆళ్ళవీధిని మాకాంతం సచ్చిపోయిందట. దానిశవాన్ని మోసేవాళ్ళన్నా లేరంట. మావోళ్ళంతా ఆడోళ్ళు పరుగెత్తారు. నాగతీఅంతే సేస్తావా! నివ్వేమన్నా సూస్తావా నేస స్తేను ?" అంది. వీరన్న ముసిముసినవ్వు నవ్వుతూ కండువా ముసుగేసుకొని "సచ్చినప్పుడు మాటగందా. నీవు సావవు. నీకేంబయుం లేదు లే." అంటూ తనదార్నే పోయినాడు. రత్తి గబగబా తనకోక ఆకోకక వదిలేసి మఱోకోక పాతది. కట్టుకొని, జుట్టు దులుపుకు మళ్ళీ జాఱుముడిగా వేసుకొని వీథంట— "మాకాంతా ఎంతలో పోయింది. జబ్బనా చేసిందన్న సంగతి తెలిపెను మాకెవ్వరికీ" అంటూ అనుకుంటూ వెళ్ళింది.

ఆడవాళ్ళు తొత్తులుగా అవడం సంసారస్త్రీలుగాని సంసారప్పురుషులుగాని హర్షించరు. కాని వాళ్ళని చూచినప్పుడు మాత్రం గుర్తించక మానరు. ఏమనా! "అదెట్టా పెట్టుకుందో మల్లెమొగ్గలు! అదెల్లా తొడుక్కుందో నీలినీలిరైకె! అదెల్లా నడుస్తూందో గజ్జెలగుర్రంలా" అని— కాని అదే వేషం ఖమజం తీసేసుకొని చినిగిన చీరతో ఏకూర తెచ్చుకోడానికో పోతూ వుంటే ఎవరూ చూడరు, ఒక్క ఎఱిగుండి కనిపెట్టుకొని వేచి కాచియున్న కువిటులు తక్క—ఆలా ఎఱుక పడకుండా పోతూ వుంది ఆఉదయం రత్తి. కూరక్కాదు— ఎందుకైతేం?— కాంతం పార్గస్తురాలైనందుకే— తెలిసికోవాలిసిందల్లా ఎఱుక పడకుండా పోతూవుందా లేదా అని.

కాంతం—గుమ్మంముందు—పాపం—చిరకాలం పడుపు వృత్తి నడపినడపి ఎంతమంది ప్రాయంలోవాళ్లని పాడు చేసిందో, ఎంతమంది ప్రాభవం తానుతీసుకొందో? ఎంతైతేం? తుదకుచనిపోయింది. దానిశవం దానిగుమ్మంముందుకటుకెక్కించేరు దానిగుమ్మంఅంటే ఒకతడికెలగది తడికెలగుమ్మం. అద్దెయిల్లు—కాని అప్పచెల్లెళ్లల్లె పదిపదిహేనుమంది తోడితొత్తులు గుమిగా మూగినారు. దానిశవంకేసి చూస్తూ జాలిపడ్డారు. "ఎత్తండర్రా! రేపు మనబతుకులూ అంతేనర్రా! ఎత్తండర్రా!" అంటూ నలుగురు వాళ్ళల్లోవాళ్ళే సోమీ కామీ మంగీ మూర్తి ఎత్తుకున్నారు. ముందు అగ్నిహోత్రం తాను పట్టుకుంటానంటూ, అప్పుడేవచ్చిన రత్తి హడావిడిపడితే, "దానికెంత ముచ్చటగా వుందో యీయండర్రా!" అంటూ ఇచ్చారు.—

అప్పటికి ఉదయం తొమ్మిదైంది. బాగా ఎండ చెట్లమీద్ది అరుగులమీదికూడా దిగింది. వీథంటే మోసుకుపోతున్నారు శవాన్ని.—

రత్తి మోసేవాళ్ళతో ఓసంగతి చెప్పింది. "ఈ కాంతం శవాన్ని దాన్నుంచుకొన్నవాళ్ళ యిళ్ళకాడ ప్రతీయింటికాడా దించుండి" అని. "వాళ్ళమొహాలీడ్చ ఓ మొగాడూ కనబడ్డు ఇప్పుడు. కృతఘ్నులు. నా వీరన్నబావైతే యిల్లో శేస్తాడా?" అంది.

[illegible]తాలు 5, 6గురు తొత్తులు నడుస్తున్నారు.

"ఎవరికైనాగాని భూమ్మీద ఉండేదేచావు. కాని ఎవరూ ఏడ్వనిచావు నీకే దక్కింది, మామయ్యా!" అన్నాడు వీరన్న ఆ పక్షినే తన యింటిఅరుగుమీద కూర్చుని తన మేనమామతో — దూరాన్ని కొంతం శవాన్నిచూచి. — మరి సరిగ్గా శవం వీరన్న గుమ్మంముందుకు వచ్చింది. అక్కడే ముందుగా ఆగి "వీరన్నా! రావయ్యా! చూస్తావుఏమిటి?" అన్నారు వెనకాలున్న శోత్రుముండలు.

రత్తి కాపిలుపుతో ముఖం కందగడ్డైపోయింది. "ఇక్కడావాకేం!" టంది తనచేతిలోని కుండనిప్పు ఏలా రగుల్తోందో ఆలా రగుల్తోంది దానిగుండె కొలిమి. "ఓసి దీంతస్సాగొయ్యా! నా వీరన్నబావనికూడా ఇది — కొంతం — తనవల్లో వేసికొంది!" అని అనుకొంది. చేతిలో నిప్పుకుండ జారేసింది. అది వీరన్న యింటిగుమ్మంముందు పగిలిపోయి నిప్పుకణాలన్ని రాజమార్గాన్నే చెల్లాచెదురయినయి.

మొట్టమొదట వీరన్నకు గుడ్లు చింతనిప్పులైపోయినాయి కాని కార్యం లేదనుకోని, అరుగుమీదున్న తన మేనమామ ఏమనుకుంటాడో అని, ఊరకే సన్నగా "పంపనే అది రత్తీ!" అన్నాడు. "నీ యింటిగుమ్మం అయిపోయింది. నాయింటిగుమ్మంముందైతే యీ కుండెడునిప్పులు నీ మొహాన్ని పోసియుండేదాన్ని." అందిరత్తి. వీరన్న అన్నాడు "శాంతించు! ఇది పగలు, రాత్రిపూటకాదు" అని —.

రత్తికి గుడ్లంట నీరుతిరిగి శవంకేసి చూచిచూచి "కాంతం ! కాంతం ! నీవు చచ్చి స్వర్గాన్నున్నావు. ధన్యురాలివి. నాకో పాఠం నేర్పేవు. నేనీరోజునుంచి పశుప్రవృత్తి ఒదిలేసి సన్యాసినిగా మాఱిపోతున్నా! నా యీరన్నబావ నావాడే అనుకొన్నా! నీవాడే! నీవాడే!" అనిశపథం పూనింది—సాగేరు, మట్టోనిప్పుకుండతో.

ఏంచేస్తాడు ? వీరన్న వీథిలో నిప్పులెత్తుకు గుమ్మంముందు శుభ్రం చేసికొన్నాడు.



| | | |
|---|---|---|
| రచన | స్ఫురణ | తొలిప్రకటనము |
| –3–1931 | నరసాపురం | "వినోదిని"లో |

౩

# వేంకటేశ్వర ప్రదీపారాధన

ఉరిశిక్ష (capital punishment) ఇవ్వవచ్చునా ఇవ్వ కూడదా అనే సమస్యలో లోకం ఇప్పుడు పడిందికాని, మా యింట్లో హేంగింగు లైటుకు హేంగింగు తీసిపాఱవేసేసి చాలా కాలమైంది. ఆ లైటు—దానికేదో వచ్చి పాడైపోతే అటకమీాద పడవేశాం. అటకే దానికి బంకోలు.

మనిషికేమిటి వస్తువుకేమిటి, చూడండీ! కొన్నాళ్లకు కర్మ పరిపక్వమైతే, తిరిగి యథాస్థానం అలంకరిస్తుంది. ఆ ప్రకారంగా మా లైటుకు మళ్లీ మంచిరోజులు వచ్చినయి కాబోలు, దాన్ని పైకితీసి, జ్వాల—జుంకా తుడిచి సరిచేసి సరంబీకి వ్రేళ్లాడదీద్దామని తలపోసి, వ్రేళ్లాడదీస్తే కాపిటల్ పనిష్మెంటు అయిపోతుందేమో అని ఆలాగ్గానే దాని మొత్త బొట్ట మోపుగా ఓ కన్నాల స్టాండుమీాద, కిందనుంచీ పైనుంచీ గాలోసుకొనేలాగు నిలబెట్టి, టేబిల్ మీాద పెట్టుకుని పని చూచుకుంటూ వున్నాను.

'పనంటే ఏమీాలేదు. నాకొచ్చిన love letters (ప్రణయ లేఖలు) అన్నీ అక్కడదిక్కడ పెట్టీ ఇక్కడదక్కడ పెట్టీ లైటు హెచ్చించి వెలుతురులో ఎలా కనబడతాయో అని వొక

మాటూ, లైటుతగ్గించి చీకట్లో ఎలా కనబడుతారో అని వొకమాటూ, ఎక్స్‌పెరిమెంటు చేస్తూవున్నాను. లెటర్సు పాతవైనా ఎక్స్‌పెరిమెంటు కొత్తదికావచ్చు. ఎక్స్‌పెరిమెంటుకూడా వొక్కొక్కప్పుడు పాతదైనా ఈ పర్యాయం వచ్చే రిసల్టు కొత్తదికావచ్చు. ఏమంటారు?

గబుక్కున నాచెయ్యి ఆ టేబిల్‌మీదవున్న బొట్టమోపు మొత్తానుడు హేంగింగులైటుకు ఎలా తగిలిందో తగిలింది. మంచి రస కంధాయపట్టు ఏదో చదువుతున్నా కామోసు — "ఓ! ప్రియుడా! నిన్ను బాసియుండడమంటే బహుకష్టంగా వుంది. నీ బాహుపంజరంలోకి అమాంతంగా దుమికేసెయ్యాలనివుంది. కాని నాపాద మంజీరం ధ్వని చేస్తుందేమోనని భయమేస్తూవుంది. ఓ! నా మోసగాడా! నీ కళ్ళల్లో నాకళ్లు పెట్టి చూడాలనివుంది. కాని మన కనుపాపల్లో నీడలు అమాంతంగా పరస్పరం గావులించుకొని మనలను గుడ్డివాళ్లనుగా చేస్తాయేమోనని సంకోచంగావుంది. ఓ! సింహోరస్కుడా! నీ హృదయంలోకి, నీ వక్షాని కపాయంలేకుండా నాకు చొరుచుకు పోవాలనివుంది. కాని వెనకాలనుంచా ముందునుంచా అనే మీమాంస ఎంతకీ తెగడంలేదు—"అని అలాగ్గా అంత ఇదిగావున్న ఒకానొక ప్రణయలేఖ చదువుతూ వున్నానేమో. బహుమాయావ్ చేసింది. పూర్వోక్తప్రకారంగా నాచెయి తగిలింది. దేనికీ? ఆ బొట్టమోపు మొత్తానుడు, వెలుగుతూవున్న హేంగింగులైటుకు.

తగిలిన పాళంగా టేబిల్ మీదవున్న లైటు, టేబిల్ మీదనే అమాంతంగా బోల్తాకొట్టి చమురుకక్కి జ్వాలాతోరణంలా అయిపోయింది. చిమ్నీ ఊడిపడింది. జ్వాలేఆపడమో చిమ్నీనే కాపాడ్డమో రెండూ తెలియక — "రా! రా! తగులడిపోయినాయి ఇవన్నీని ఈ ప్రణయలేఖలన్నీని" అన్నాను, అప్రయత్నంగా. అంటూనేవున్నాను! గదిఅంతా చీకటిమయం అయిపోయింది. ఆచీకట్లో బుడ్డిదీపం పుచ్చుకొని, అంటే బుడ్డి దీపం అన్నమాట అదే కైత్రనాము లైటు, అదుచ్చుకొని తయారైంది మా ఆవిడ తాయారమ్మగారు.

"ఏమిటి గొడవ?" అంటుంది. "ఏముంది? నిప్పూ నేనూ యీ యీ వస్తుప్రపంచం పరశురామప్రీతి అయి యుండిపోవలసింది. ఓగడియ క్రిందట" అన్నాను. "మరి కాలేదేం?" అంది శాంతంగా ఆవ్యక్తి. "కాలేదు. నీపుణ్యవశాత్ కాలేదు." అని అక్కణ్ణుంచి వేదాంతంలో పడ్డాను, ఆవిడతోటి ప్రసంగిస్తూ. "చూడూ! ఇలాంటివే నేవ్ మహాప్రళయాలు అన్నా మహాప్రళయాలు దాటుకుపోవడమన్నాను! — నిజంగా నీవు చూల్లేదుగాని మన హేంగింగు లైటు ఇప్పుడు గుప్పుమనడం, బ్రహ్మాండంగా మండిపోయింది ఈ టేబిల్ మీద — ఈ కాయితాలన్నీ నుసిఅయిపోయినాయే అనుకొన్నాను. కాని దేవుని అపారమైన కృపవల్ల కాలేదు, ఏదీ? వొక్క దివ్యోపాసన కానియ్యి, ఆ పరాత్పరుడికి మన కృతజ్ఞత తెలపాలి" అన్నాను.

అనేసరికి తారాజువ్వలాగు లేచింది. ఆ బుడ్డిదీపం అక్కడ పెట్టింది. "మళ్లీ తీశేరూ ఆ చిత్తకాగితాలు! మీ పిణాయ

లేఖలు ! ఇలాఇవ్వండి, అవి ఇలాఇవ్వండి అవి— "ఇవి మీదగ్గ ఉన్నన్నాళ్ళూ, దీపాలూ పడగొడతారు, దెయ్యాల్నీ విడగొడతారు, ఇలాఇవ్వండి! ఇమ్మనమంటే? ఇప్పటికైనా ఇవ్వరేం? " అని నా చేతుల్లోనున్న లేఖలన్నీ ఊళ్ళాక్కుని ఇంతింత ముక్కలుగా చించి గిరాటేసింది. వీధిలోకి విసిరేసింది.

"ఎవరైనా తెల్లాటి అంటించి చదువుతారేమో?" అన్నాను. అనేసరికి తానేస్వయంగా అవతలకువెళ్ళి బుడ్డెడు చమురూ ఆ చించిన ముక్కలమీదపోసి అగ్గిపుల్లట్టుకొచ్చి అంటించి, జ్వాలచేసి "ఇక నిదరోండి!" అంది.

చెప్పొద్దూ! నా హృదయం మహావేదన పడిపోయింది. అలా ఆ నా ప్రణయ లేఖలు తగులడిపోతూవుంటే కాని ఓ విజయం! ఏతాయిలంగారు ఆ లేఖలు వ్రాసినారో, నా తాయారమ్మకు తెలియకుండా అవి తగులడిపోవడమే నాక్కావలసిందిఅల్లా!

ఆ ముక్కనేసరికి మొగమ్ముణిచిపెట్టుకొని—నా తాయారమ్మ మొగమ్ముణిచి పెట్టుకొని—"లోకమా! నవ్వు! లోకమా! ఏడుపు! లోకమా! చావు!" అని శోకశే విజృంభణ, క్షణక్షణ... ...

ఆ విజృంభణ ఎప్పుడు ఆగింది? వేంకటేశ్వర దీపారాధన మొక్కు లోలో నేను మొక్కుకుని, అసలు తాయారమ్మకు మొక్కి, వడ్డితాయారమ్మకు మొక్కితేనేగాని ఆగలే!

| రచన | స్ఫురణ | తొలి ప్రకటనము |
|---|---|---|
| 10-11-1936 | నరసాపురము | " వినోదిని " లో |

౮

# మిక్స్‌డ్

"గమ్‌సెడ్ పూర్" అనే ఒక పట్నం, కొండ మీది ప్రాటీ లాగు, ఒక ఎత్తైన దిబ్బమీద నిర్మింపబడ్డది. అది ఇంటర్నేషనల్ సెంటరు జెనీవాకంటె ఎక్కువ చాచా. ఏమంటే జెనీవా నుంచి కనవచ్చే చిత్రాల్లో ప్రతివ్యక్తికీ ఏవో ఒక రకంజాతి దిరీసు వుంటుంది. ఈ గమ్‌సెడ్‌పూరులో అలాకాదు. వేషం తన శరీరానికి ఎలాఅనుకూలంగా వుంటే అలా వేసుకోనడమే విధాయకం అన్నట్లు వేసేస్తారు. లావుపాటి మహాలంబోదరుడు గూడకట్టు కట్టి, ఆ గూడకట్టు దిగజారిపోకుండా తన మొలకు అమరే పటకా బజారులో ఎక్కడా లేకపోతే, ఆడాళ్లెట్టుకునే బ్రూచ్‌సూది, అట్టేవాళ్ళు పోకముడి వేసికొనే ఆ ప్రాంతాన్ని తన మొలగుడ్డకు గుచ్చుకుని, అదియింకా దిగజారిపోతూందేమోనని మొలకట్టుకు లగాంగా పంట్లాం తాళ్లలాంటివి, బోరను బుజాన్నీ వీపునా కనబడేటట్టు, ముందునుంచి వెనక్కి కరిపించుకుని, అంతే—అలాగే—పయిమీద కండువాఅన్నా లేకుండా నడిచిపోతూవుంటాడు. ఎంత అవకతవక అడ్డదిడ్డపు విదేశీ ఫామ్‌ మిశ్రావులన్నా మగాళ్లు వేస్తారుగాని, పాపం, ఆడవాళ్ళు ఆదేంచేతనోగాని చీర జాకెట్టు ఇత్యాదుల్ని

మానరు. కాని వాళ్లు మాటల్లోను, ఆటల్లోను, పాటల్లోను, అంత పట్టాశక్యంగాని ముందంజే వేశేరు. నేలమీాదే బిలియర్డ్సు ఆడేస్తూ వుంటారు ఆ గమ్‌పెడ్‌పూరులో యువతీమణులు. చేత్తో ఫుట్‌బాల్, ముక్కుతో కారెమ్సు ఆడేస్తారు ఎంచేతా అంటే ఆ పట్నంయొక్క ముఖ్యలక్షణాల్లో ముఖ్యలక్షణం ఇది. ఏ ఆటన్నాసరే దాని కో దేశకాలపాత్రవిధివిధానా లేమిటి, ఏలాపడితే ఆలా ఆడవచ్చునని, ఏ వేషమన్నాసరే దానికోజాతి నీతి హేతువాద విలాస ధీధితి యేమిటి, ఏలాపడితే ఆలా ఎందుకు వెయ్యకూడదు ? అని.

"గమ్‌పెడ్‌పూరు"కు అర వైఆరు మైళ్లల్లో "నిమ్మనీడ తరంగం" అనే ఒక సముద్రతీర విశాల పురముంది. సిమ్లా కంటె చల్లగావుండే అన్లువృక్షాల్ని కొట్టివేసి, ఆ పట్నంఅంతా నిమ్మచెట్లు పాతించి, మఱింత చలవగావించి, ఆ నిమ్మచెట్ల మొదళ్ళకు సముద్రపు కెరటాలు తగిలేటట్టు చేయడంవల్ల దానికాపేరు వచ్చింది, అంటారు. "నిమ్మకు నీరోసినట్టు" అనే సామెత అక్కడే అన్నట్టు, సముద్ర కెరటంకూడా అణగి మణగి ఆ చెట్లమొదట నిశ్శబ్దంగావుండి మనశ్శాంతి కలగ జేస్తుంది. ఆలా ప్రకృతినన్నా నిశ్శబ్దం గావించేవారు గాని, నిమ్మనీడ తరంగపుప్రజలు, తమ పట్నంపక్కనుంచి పోతూ వుండే రైళ్లరొద ఆపుకోలేకపోయినారు. అందులోకి గమ్‌పెడ్ పూరు, నిమ్మనీడతరంగము, ఈ రెండువూళ్ళూ మెయిన్

లైనుమీదవుండి, ఒకదానినుండి ఒకదానికి కోచెస్సు, షట్టుల్సు, అటుగడుక్కీ నడుస్తూ వుంటాయేమో మరీ అసహ్యాప్రుష్యాని.

నిమ్మనీడతరంగం అన్ననగరంలో రంగనాథం అనే ఒక గొప్ప టెన్నిసు ఆటగాడు వున్నాడు. అతణ్ణి గ[illegible]ప్రాంతంలో ఆడవాళ్లంతా "స్వీట్ రంగనాథం" అనికూడా పిలుస్తారు. ఎంచేతాఅంటే ఆవూళ్ళో ఆడవాళ్లకు టెన్నిసుఅంటే బహుప్రీతి మహాప్రీతి. ఆపిలిచేటప్పుడు వాళ్ళహృదయాలకు వాళ్ల చేతుల్లోని జాటీగళ్ళు హత్తుకొని మరీ పిలుస్తూవుంటారు. తఱుచు చాలామంది ఇతగాణ్ణి పార్టనర్‌గా చేసుకొని పెద్దపెద్ద తుదిగిన్నెలు కొట్టేఅవకాశా లుండడంచేత "స్వీట్ రంగనాథం" అనేపిలుపు మరీ పరిపాటి అయిపోయింది.

నిమ్మనీడతరంగంలో అసలు టెన్నిసుకోర్టేలేదు. అక్కడందఱూ మగవాళ్ళు ఆ చెట్లనీడపట్టున సాచుకూర్చుని అన్ని రకాల అల్లఱి చిల్లఱి పొల్లుకబుర్లూ చెప్పుకుంటూ వుంటారు. ఆడవాళ్ళు అరుగులమీదా అక్కడా కూర్చుని అయిపోయిన అవుపోసనాలనుగురించి, కాబోయేవాటినిగురించి, కొత్తగా వూళ్ళోకి వచ్చిన సారెలనుగురించి, లొడలొడగా అనుకొంటూ వుంటారు.

మనరంగనాథం నిమ్మనీడతరంగమువాడైనా, ఈ కబుర్లూ కాలక్షేపాలు కాకుండా టెన్నిసుఆట ఆతగాడికి ఏలా అబ్బింది అంటే అది సమస్యే! దానికి చెప్పేది వేఱే ఏమీ లేదు. అతను

అసలు గమ్‌పెడ్‌పూరువాడు అయియుండి నిమ్మనీడతరంగాని కిల్లఱికపు టల్లుడుగావచ్చి, భార్యానుమట్టుకు ఇక్కడ తనకు ఇంట్లో పార్టనర్‌గా వుంచుకొన్నవాడై, మఱి తక్కిన అన్ని యితర వ్యవహారాలకు గమ్‌పెడ్‌పూరులో ఆడవాళ్లనే తనకు పార్టనర్సుగా చేసికొని కాలంబుచ్చుతూండేవాడు అతనికి గమ్‌పెడ్‌పూరులో ఒక ఫాన్సీషాపు వుంది. దానిలో తనకో స్త్రీరత్నం పార్టనర్. అతని ప్రతిపాదనం మఱేమీలేదు. వేతే వేతే ప్రతిదానికీ మిక్సెడ్, మిక్సెడ్ అని వివరించడమెందుకు? ప్రపంచమంతా మిక్సెడ్, రోడ్లన్నీ మిక్సెడ్, దానికో పెద్ద ఆశ్చర్యం పోనవసరము లేదని అతని ప్రతిపాదనం.

రంగనాథం భార్యపేరు కురంగినయన. ఆవిడ నిమ్మనీడ తరంగంలో పుట్టిపెరిగిన ఆడపిల్లల్లో అతి సుకుమారిన్నీ, సునిసితపు బుద్ధిగలదిన్నీ; భర్తనేమీ కొంచి ప్రశ్నించకుండా వెయ్యి కళ్ళా కాపాడుకుంటున్నానని ఆమెయిది.

రంగనాథం ఉదయం పదిగంటలకు మెయిలుకు యిట్టేతన రాకెట్టుచ్చుకు భార్యతో చెప్పకుండా వెళ్ళిపోయినాడు.

కాని ఆకిరితంరోజున వూరూరా పత్రికల్లోను కరపత్రాల మూలంగానూ ఫలానిరోజునఫలానిఫలానివారికి సాయంకాలము మిక్సెడ్‌డబుల్సు అని బ్రహ్మాండంగా పంచిపెట్టివేశారు, ఫలాని గమ్‌పెడ్‌పూరులో ఫలానిచోటని; ఆ కరపత్రాలు ఊరూర మూలమూలలకు వెళ్ళిపోయి, కురంగినయన చేతిలో ఎగిరిపడ్డట్టు

ఒకటి వచ్చిపడింది. ఆవిడ చేతిలోకి అలాంటి కాగితం రావడం అదే మొదటిసారి, అసలే ఆవలిస్తే పేగులు లెక్కపెట్టేమనిషి కాబట్టి మగడు అల్లా రాకట్టుచ్చుకు వెళ్ళినవెంటనే తాను రైల్వేగైడుతీసి చూచి 12 గంటల కో మిక్స్డు ట్రయిను మధ్యాహ్నం నిమ్మకాడతరంగంనుంచి గన్నావరపురాకు పోయేది వుండడం తెలుసుకుంది. వెంటనే తాను ఆ మిక్స్డు ట్రయినుకు టిక్కెట్టు కొనుక్కొని గన్నావరపూరు సరిగా నాలుగ్గంటలకు సాయంత్రం వెళ్ళింది.

అక్కడ కురంగినయన ప్రేక్షకుల్లో కూర్చునిచూస్తూవుంది. పచ్చజండా ఒకటి తన భర్త తనభర్త పార్టనర్ స్త్రీ ఆడుతూ వున్నవైపు గాలికాడుతూవుంది. రెండోవైపు ఏజండా లేదు. చివరకంటా చాలాబాగా ఆడి తనభర్తజట్టు నెగ్గడం హర్షపులకిత నేత్రాల్తో కురంగినయన చూచి తానుకూడా అందరితో పాటు కరతాళధ్వనులు గావించింది.

రంగనాథం ఆటఅయి ఓడిపోయిన ఎదరజట్టులోని మగవానితోను స్త్రీతోను కరస్పర్శాదులు చేసినపిమ్మట ప్రేక్షకుల కేసి రావడంలో కనుక్కొన్నాడు తనభార్య కురంగినయనను.

అప్పుడు దంపతులిద్దఱికీ ఇలా సంభాషణ జరిగింది.

రంగనాథం :- నీవిక్కడకు ఎందుకు వచ్చావు ?

కురంగినయన :- మీ మిక్స్డు డబుల్సు చూడ్డానికి.

రంగనాథం :- ఏలా వచ్చావు ?

కురంగినయన :- 12గంటల మిక్స్డు ట్రయినుమీద.

రంగనాథం : ఏలావుందంటావు మాఆట ?

కురంగినయన :- ఓ ! ఫుల్ ఆఫ్ మిక్స్డ్ ఫీలింగ్సు !

రంగనాథం :- (పెద్దనవ్వు నవ్వి) you mean your feelings in seeing (చూడ్డంలో నీ అనుభవమున్నూ) my feelings in playing (ఆడ్డంలో నా అనుభవమున్నూ) నా ?

అంతట్లోకి నిమ్మనీడ తరంగానికిపోయే బండికి సిగ్నల్ వాలింది.



| రచన | స్ఫురణ | తొలిపత్రికటనము |
| --- | --- | --- |
| 2-8-1935 | రాజమండ్రి | "వినోదిని"లో |

# ౬

# భయం

భయమనేది వొకటి చిన్నప్పట్నుంచీ మన కలవడ్డ ఎరువు గుణం. దాన్ని మానవునియొక్క సహజమైన సరుకుల్లో దానినిగా ఎంచడాని కెంతమాత్రమున్నా వీల్లేదు. పోంగొట్టుకునే వాళ్ళ కది పోతూనేవుంది. కాని తెచ్చిపెట్టుకునేవాళ్ళకు కుదిరి నెత్తి మీాది దేవతలా కూర్చుంటూనేవుంది. ఆహారనిద్రల్తోపాటు జతగూర్చి భయమనేది సర్వసామాన్య నిసర్గప్రవృత్తిగా పంచ తంత్రకారుడు వ్రాసేడుగాని అది వాని తంత్రమంత్రమే! మన లోని ముడిపదార్థం ఎంతమాత్రమున్నా కాదు.

మొట్టమొదటి భయదరూపం "బూచి." ప్రతిచంటి పిల్లను "బూచేవు, బూచొస్తోంది. బూచేవు!" అని జడిపిస్తారు తల్లిదండ్రులూ అన్నలూ అప్పలూ. ఆకారంకూడా ఆచిట్టి కియొక్క కట్టెదుట నిలబెట్టినట్టు అక్షరాలా వర్ణించి అభినయించి చూపెడతారు. "అదిగో నేవ్! ఎంతెంతగుడ్లో దానివి! ఎంతగడ్డముందో దానికి! జడతెల్లావిరబోసుకుని చీకట్లోంచి తోవ చేసుకుంటూ బావురు బావురుమంటూ వస్తూవుందో!" అని ఆచిట్టి కళ్ళుమూసుకొని గుక్కుమిక్కు మనకుండా నక్కి చిక్కిపోయే దాకాగాని విడిచిపెట్టరు.

ఇలాగ్గానే నన్ను అంతా ఝడిపించారు ఐదుఏళ్లు వచ్చే దాకా; అయితే ఏట ఏంజరిగిందీ! నానెత్తిమీద క్రిమక్రి మంగా బలిసి అడివిలా అల్లుకుపోయినప్పుట్టు వెంట్రుకల్ని అన్నింటినీ కేశఖండనమహోత్సవ మప్పుడు తీసివేయడం సంభవించింది. దాంతో ఆబోడిబుర్ర అద్దంలో చూచుకొని "బూచాడి పనికూడా ఇలా పట్టేస్తే వానికి గడ్డం జడలూఅన్నీ వమ్మైయిపోతాయిగదా" అని అనుకొన్నాను. అనుకోని వో మాటు మాయింట్లో అలమారులోవుండే పోటకత్తి పుచ్చు కొని కాళాంధకారంలో అమవసనిసిని బయల్దేరాను. "బూ చాడి గడ్డం బూచాడి జడలు తెగ్గోసి పారేశాదా" మని బయ ల్దేరాను. కత్తి ఎప్పుడైతే చేత్తో పట్టగలిగానో అప్పుడే బూ చాడు మాయమై పోయినాడు.

రెండో భయదరూపం ఉపాధ్యాయుడు. అమ్మ పీడిల్లు బంగారంగాను; ఉపాధ్యాయుడు అనే మనిషి ఉన్నాడే అతడు బూచాడుకంటే పొడుగ్గా కూడావుండి పిల్లల్ని వేధించు కుతింటూ వుంటాడు. మాట్లాడితే అయ్యవారొస్తార్రోయి అని పాడలగొట్టేశేవారు, ఇంటిల్లిపాదీని; తిన్నగా నన్ను మెతుకులు కూడా తిననిచ్చేవారు కారు. బూచాడు చీకట్లోవుండే నన్ను భయపెట్టేవాడు గాని ఈ అయ్యవార మినట్టయినా పట్టపగలే దోపిడీ అన్నట్టు, నాఆటల్ని దోచుకుపోయావాడు. ఎక్కడ కనబడితే అక్కడే "ఏంచేస్తూవున్నావు అబ్బాయీ!" అనేవాడు. ఆ అనడం వినీవినడంతోనే నాప్రాణాలు కడట్టిపోయావి.

ఈభయం ఎలా వదిలించుకోవడమా అని చాలాకాలం ఆలోచి స్తూరాగా, ఎప్పటికైనా ఫలిస్తుంది తపస్సు! నాకు వడుగు చేశారు. ఆ తరువాత అయ్యావారు వచ్చి చెవులెక్కతియ్య బోతే "ఏమండో! నేను మడికట్టుకొన్నాను. నాకు వడుగైంది నన్ను ముట్టుకోబోకండి నన్ను ముట్టుకున్నారా అంటే మా అమ్మతోనూ మా నాన్నతోనూ చెప్పి మిమ్మల్ని చితకతన్నిం చేస్తాను." అనేవాణ్ణి. వడుగు అనేది మగవాణ్ణి పిడుగ్గా చేస్తుంది అనుకోండి. ఉపాధ్యాయులవారు "నీకు అవితే, బ్రహ్మోపదేశం బాగానేఅయింది!" అని వెనక్కు వెళ్లిపోయా వారు. అది పనిగా బరెగేసి, బ్రహ్మవిద్యాపరుణ్ణి అయ్యేకొద్దీ ఎటువంటి గురువొచ్చినా "నీవెంత? నీ పేబ్బెత్త మెంత!" అని ముదలకించేవాణ్ణి. ఏమనుకున్నారో!

మఱి మూడో భయదరూపం పాపభయం. ఈ భయానికి రూపనివృత్తి చేయడమే బహుప్రయాస. నల్లిని కాల్తో రాయడం దోమను చేత్తో మోదడం ఇదే పాపం అని కొం దఱు నిర్వచిస్తూవుంటే, ఆలగోల బాలగోల అయిపోతుందనే తెలుపూ వెంచాటూ లేకుండా ఏరోప్లేనులనుండి కొందఱు ఘోరంగా బాంబులు నేలకు విసిరేస్తూ వున్నారు! పాపరూప ప్రమాణం కామరూప ప్రమాణం ఒకటే—చింతాకంత పాపం తాను రాకంతవుతుంది. చీపురుపుల్లంత పాపంతాళవృక్ష మంతవుతుంది. అంచేత ఈ పాపమనే భయం ఏపని చేదా మన్నా మనిషిని సంకుచిత స్వభావునిగాచేసి పారేస్తుంది.

దీనికో చిన్న ఇతిహాసం వుంది—బలేనవ్వొస్తుంది చదివితే. చదవకుండానే నవ్వొస్తుందా మఱీమంచిది—

చంద్రవంక అనే పొంకపు టూయారి వొక్కత్తెవుంది ఈ జగత్తులో తప్పపుట్టింది అది. చిత్రకారుడు చిత్రిస్తే రెండు గీతలు గీసి ఒక చుక్కెట్టి ఆ స్త్రీయొక్క వక్షోజాన్ని చూపించగలడేమోగాని, ఆ వక్షోజాన్ని ఆవరించివుండే చీరపయట సౌందర్య పరివేషం మనమూహించుకోవలసిందే. కవి విలిఖిస్తే నాలుగుపంక్తుల్లో ఆ స్త్రీయొక్క అధరోష్ఠం వర్ణించగలడేమోగాని ఆ పెదవిలోంచి వుట్టిపడే అమృత మాధుర్యాన్ని మనమూహించుకోవలసిందే. గాయకుడు పాడితే రెండుతీగెలమీద ఆ స్త్రీయొక్క శృంగార రసాన్ని సట్టాట్లు పణిచ్చేడేమోగాని, శోణికింపు కతీతమై విలసిల్లే ఆ ప్రేమపూరితమైన నీరవ విజ్ఞానం మనమూహించుకోవలసిందే.

ఆమెకూ బూచికీ ఏమాత్రం పోలికలేదు. ఆమె చర్యకూ అయ్యవారి చర్యకూ సహస్రవార. అయితే నాకు లోపల పికరు. ఆమెను చూచినప్పుడల్లా పికరే! ఈ పికరు వదిలిపొయ్యే గత్యంతరం ఏమిట్రాఅని నూనూగు మీసాలొచ్చిన ప్పట్నుంచీ ప్రయత్నం.

ఓ రేయి జాడజాడగా వెన్నె లగపిస్తూవుంది. వాడవాడా "నీడా? గోడా?" అన్న అనుమానమే. ఆలాంటప్పుడు ఆవే, అవగా చంద్రవంక అన్న జవ్వని విహారిస్తూవుంది. నాకు లోపల

జంకట్టు కుంచెందుకో? సమయం వొచ్చేదికదా అవి నా పూర్వ పరిచితులైన, పరిచితులని ఎందుకు అంటూవున్నా ననగా వారంటే చాలాకాలమై భయము నాకు పోయిందిగా ! —ఆ బూచాడూ ఆ వుపాధ్యాయుడూ ఇద్దరూ కూడా నన్ను దుమ్ముబట్టుకొని "ఏమోయి వత్సా! భయపడుతున్నావు ?" అని అడిగారు. అడిగితే "భయం! నాకెందుకు భయం !" అన్నాను. అన్నానేగాని లోపలి పికరు ? అదల్లాగే వుంది. అప్పుడు వుపాధ్యాయుడు ఏంచేశాడు అంటే అల్లా ఖడేరావు అన్నాడు. అని నాకు ఆ పిల్లనుకుఆటించి "సెక్సు ఫిజియాలిజీ", అంటే ఇప్పటి పరిభాషలో ఇ. యన్. టి. లు అనుకోండి, ఆ సంగతులన్నీ విప్పిచెప్పినట్లు చెప్పి చూపించాడు. ఆపాళంగా అనుకొన్నాను. "సీతస్సాదియ్యా! ఉపాధ్యాయుడా ! నీకడుపులో ఎంత వూకవుందీ !" అనుకొన్నాను. వాని సౌందర్య విజ్ఞానానికి ముగ్ధుణ్ణైపోయాను. ఆలా ముగ్ధుణ్ణై యుపాధ్యాయుణ్ణి బ్రహ్మారథం పట్టేస్తూవుంటే బూచాడేంచాశాడూ ? "ఉపాధ్యాయుడు చెప్పింది అసలు నేర్చుకోవలసినదానిలో ఆవగింజంతన్నా కాలేదు." అని తాను "సెక్సు సైకాలిజీ", అంటే ఇప్పటిపరిభాషలో, కిసెస్సు, వాటిగివింగ్సు, వాటి మిస్సింగ్సూ, వాటి మిస్గివింగ్సూ అను కోండి. ఆ సంగతులన్నీ క్షుణ్ణంగామథించి వ్యాకుచ్చినట్లు వ్యాకుచ్చి కర్ణపేయం గావించాడు. ఆపాళంగా అనుకొన్నాను "సీయింట బట్టారంగాను బూచోడా

నీవెంత వాడవోయి !" అని అనుకొన్నాను. వాని ప్రణయ విజ్ఞానానికి నోరు తెఱచి నిర్విణ్ణుణ్ణైపోయినాను.

ఇప్పుడు నీ కడుపులోని భయం ఏలావుంది? అన్నారు ఇద్దఱు స్నేహితులూ కూడా వొక్క గొంతుకనన్నట్టు అంటే పాపభయం పోయిందన్నాను. "మరేం భయమట్టుకుంది ?" అని అడిగేరు. "పెళ్ళిభయం" అన్నాను.

అనేసరికి "ఆ భయం మేంతీర్చలేం ఆర్చలేం. అది మీలో మీరు చూచుకోవలసిందే" అని బూచాడూ ఉపాధ్యాయుడూ కూడా ఇద్దఱూ తిరోహితులైనారు. అక్కడున్నదల్లా నేనూ ఆ సుందరీ! సుందరి మెల్లిగా అడిగింది. "పెళ్ళిభయం అంటే ఏమిటి?" అని "ఏమీ లేదు నీ ముఖంమీద పోత్ర పొక్కలేను" అన్నాను. ఆపాళంగా పక్కననవ్వి ఆ చక్కని చుక్క "ఇవిల్లావుంటాయి అనుకొంటూ వున్నారా! ఇవెంతో నేపా పోంగొట్టుకోవాలంటే! ఆలా బజారుకెళ్ళి వొక్కస్నోసీసా వొక్క ఫేస్ పౌడరుడబ్బా, తీసుకురండి. తీసుకువచ్చి నాకివ్వండి. ఇచ్చి ఆలాచూస్తూ వుండండి" అంది. తెచ్చియిచ్చాను. ఆరెండూ చంకనెట్టుకుని "చూడండీ! వీటికేంగాని cream తెలియదూ మీకు? వెందుక్రికలూడ్చే మీగడ? ఆఁ తెలియకేం? బొమ్మ కూడా చూచేవుంటారు! అదోట్యూబ్ తెచ్చి పెట్టండి."

అంది. తెచ్చియిచ్చాను. "దాంతోపా టో గ్లిసరీన్ ట్రాన్స పెరెంటు సోపుతెచ్చి పెట్టలేకపోయినారూ" అంది. అదీ తెచ్చియిచ్చాను "మఱి వో వోయిల్ చీర! ఓ వోయిల్ కలర్ బాడిన్! సోయిల్పోయే కెమికల్ వాష్ అవన్నీ యేవండీ!" అంది. అవీ తెచ్చియిచ్చాను. ఆలాగ్గా అడిగిందల్లా ఆ సుందరికి పట్టుకువచ్చి యిస్తూ ఆ సుందరి కేసి చూస్తూ కొంతకొంత పికరు పోగొట్టుకున్నాను. కొంతకొంత అని ఎందుకు అన్నానూ అంటే పెళ్ళికాకుండానే ఇన్ని కోరికలు కోరే మనిషి పెళ్ళికాలమందెన్ని కోరుతుందో అని—ఎన్ని హిరణ్యాక్ష వరాలడుగుతుందో అని. కొంతమట్టుకవన్నీ అంచనా వేసి, ఒక అరచేతి వెడల్పు జరీవున్న సేలంచీర, బెత్తెడు వెడల్పున్న చైనుసహా రిస్టువాచీ, మణుగున్నరతూగే ఏకండీ మిఠాయివుండా యిలాంటివన్నీ పెళ్ళిబహుమానాలంటూ పట్టుకొచ్చి పెళ్ళికిముందే చూపించి ముందుంచాను. సుందరి మిక్కిలి సంతోషించింది. అవన్నీ అంది పుచ్చుకుంది. పుచ్చుకొని అందికదా "చూడండీ! పెళ్ళికి భాజాభజంత్రీలు పెట్టబొయ్యేరు గనుక పురోహితుణ్ణి పిలవనంపేరు గనుక!" అంది. "వద్దంటే మానేశాస్తాను." అన్నాను. "వద్దన్నమాటేగా! మఱొక్కటి! పెళ్లి అప్పుడు మీరే వాగ్దానాలు చేసినాసరే నేనుమాత్రం ఏమీ వాగ్దానం చెయ్యను సుమండీ! ఆడదానికి వాగ్దానాలు ఏమిటి, కోరికలుంటే చెప్పుకోవాలిగాని" అంది. అంటే ఏమనీది నేను! పోయిన పికరు మళ్లా కొంచెం ఇంటెర్మిటెంటు ఫీవర్లా నాకు లోలోపల తగిలింది.

అయినా అది పైకి వెల్లడించకుండా "సరే నీయిష్టంవచ్చినట్లే" అన్నాను. అగ్నిహోత్రంముందు కూర్చుని "నాతిచరామి" అని నామాటనేను వప్పుగించాను. మగాడిది వాగ్దానమేగా వాడికి కోరిక లేమిటి గనకా! సుందరి నాచెవిలో మెల్లిగా తనకోరిక లిలా వూదింది. "చూడండీ! నేను మీకేసిచూచినప్పుడే మీరు నాకేసి చూడవలెను. నేను మిమ్మల్ని ముద్దెట్టుకున్నప్పుడే మీరునన్ను ముద్దెట్టుకోవలెను. నేను మిమ్మల్ని కౌగలించు కొన్నప్పుడే మీరు నన్ను కౌగలించుకోవలెను." అని నెలకు మూడువానల్లా మూడుకోరికలు కోరుకుంది.

కోరి అటుతిరిగి కూర్చుంది. నేను ఇటుతిరిగి కూర్చున్నాను. అగ్నిహోత్రుడు సాక్షిగా మళ్ళీ ఆసుందరి నాకేసిచూడలేదు. నేను ఆసుందరికేసి చూడలేదు. పోనీ కళ్లుమూసుకు ముద్దెట్టు కుంటుందేమోఅని అనుకున్నాను. ఉఁహూ! పోనీ చూడకుండా ముద్దీకుండా ఊరికే కావలించుకుంటుందేమోఅని రెండుఘుళ్లు అలానే కనిపెట్టుకూర్చున్నాను ఉఁహూ! పోనీ నేనైనా ఆపను లన్నీ ముందుచేదామాఅని తలపోస్తే నాకు "నాతిచర" అయిరి.

మొదటితరం రెండోతరం మూడోతరం ముత్తైదువులెంతో మందివచ్చి "ఇవేంకోరికలే, మగాణ్ణి అణిచేసే కోరికలు! అసలే పెళ్లిభయం అన్నవాడికి మరీ పిరికిమందు పోశేశావు, ఏవో కూడరానికోరికలు కోరి; ఇలాంటి కోరికలుంటాయటే! మగాణ్ణి

వాడియుత్సాహాన్ని పురస్కరించుకొని ఆడది ఎత్తేయ్యాలిగాని" అని ఎంతబోధించినా నాచంద్రవంక ఊఁహూ! పైపెచ్చు "నేనేం కోరుకొన్నానో మీకు తెలుసునా?" అని ముదలకించింది వాళ్ళందర్నీని. వాళ్ళు నాదిక్కు మొగమై "నీకేం చేటొచ్చింది? అది ఇటుతిరక్కపోతే నీవటు తిరక్కూడదా?" అన్నారు. అంతే నాకు "నాతిచరామి! నాతిచరామి! నాతిచరామి!" అన్నాను మిక్కిలి నిర్భయంగా! నవ్వాలేక చచ్చారువాళ్ళంతా! చంద్రవంకకూడా కొంచెము ముసిముసినవ్వు నవ్వింది. చాలనుకున్నాను. మరి ఎలాంటిభయం లేదనుకున్నాను.



| రచన | స్ఫురణ | తొలిప్రకటనము |
| --- | --- | --- |
| 21–2–1987 | రాజమండ్రి | "వినోదిని"లో |

## ౧౦

# ఒరుబుక్కింగు క్లార్కు పామిస్ట్రీ

## (లేక)

# రయితు సమస్య

స్టేషను ప్లాట్ ఫారముమీదికి రైలొచ్చింది. రైలువచ్చిందీ అంటే అది ప్రయాణీకుల్లో కొత్తజీవం పోసిందన్నమాటే. కూర్చున్నవాళ్లు లేస్తారు. లేచినవాళ్లు నడుస్తారు. నడుస్తూన్న వాళ్ళు పరుగెడుతారు. నిజంగా ప్లాట్ ఫారంఅంతా ఒక్కసారిగా సచేతనమైపోతుంది.

ఆవచ్చింది కాకినాడకేసి వెడుతూవున్నబండి. అది చూచుకోడు వో చదువురాని మూర్ఖుడు. గుండె లవిసిపొయ్యేట్టు పరుగెత్తుకొచ్చి "నిడదవోలుకు టిక్కెట్టండోయ్! బండి వెళ్లిపోతుందండోయ్" అని ఊబుక్కింగు క్రంతదగ్గర కేకవేస్తూ వున్నాడు. "కాదయ్యా! ఈబండి వెళ్లిపోవాలి!" అంటే వినడు. బుక్కింగు క్లార్కు టిక్కెట్టుఇవ్వడు. ఈ చదువురానిమూర్ఖుడు అరంధ్రాని కడ్డంగా నిల్చున్నాడు. చదువుకున్న వోక్రిస్టియను యువతి ప్లాట్ ఫారంమీదనుంచి పరుగెత్తుకుంటూవచ్చి "సార్! సార్!

దయచేసి మూడుటిక్కెట్లివ్వండి. కడియం, మేడపాడు, సామర్లకోట" అని బుకింగు బొజ్జై దగ్గరకు చొరబడి, ఆ అడ్డంగావున్న మనిషినిచూచి "సార్! సార్! తప్పుకోండి" అంది. వాడుఆపెద్దన్నయ్య తనకూడా ఓటిక్కెట్టు నిడదవోలు కావాలని తీసుకోమంటూ వెనక్కితగ్గేడు. ఆమె ముందుకువెళ్లి "సార్! సార్! దయచేసి" అంటూ చేయి బుక్కింగుబొత్తలోకి దూర్చి చూపు రైలుమీదకెట్టి 'వెళ్లిపోతూందిబండి. సార్! వెళ్లిపోతూందిబండి!' అంది. బుక్కింగుక్లార్కు ఆమె చేయి చూచి "ఎన్నిటిక్కెట్లు?" అని అడిగేలో స్టేషన్‌లో గంటకొట్టేరు. గార్డు ఈలవేసేడు. బండీఅంతా ఇంజన్‌లాగుడు దేకుడు ధ్వనులు గావిస్తూవుంది.

రైతు పట్నాయకు వొక హవాళంగా రయితునివతలకు లాగి 'వాళ్లూ వాళ్లూ అంతావొకటే- అంటే స్టేషన్ మేష్టరూ, టిక్కెట్టుకలక్టరూ, బుక్కింగుక్లార్కూ- అందఱూ ఏకమే! నీ మాట వినేవాళ్లెవరు? వెఱ్ఱిమొకమా! నీకేమైనా అన్యాయం జరిగిందని తోస్తే వ్రాతమూలకంగా రాసిబోర్డుఆఫ్ డైరక్టర్సుకు ఓపిటీషను పెట్టుకో, నేనున్నూ నాలుగురోజుల్లో ఇంగ్లాండు పోతూ వున్నాను. అప్పుడికొశ్చన్ అక్కడ ఏజిటేట్టుచేసి నీగ్రివెన్సు రిడ్రెస్సు అయ్యేటట్టుచూస్తాను" అన్నాడు.

"ఈ రైలుపట్టాలు ఇంగ్లాండువాకా పోయ్యాయి! వీటి తస్సాదియ్యా!" అని పెద్దనవ్వు నవ్వాడురయితు. ప్లాట్‌ఫారం

మీద బండీకి సైటుబెల్ వాయించాడు కూలీ. బుక్కింగు క్లార్కు టక్కుటిక్కుచప్పుడు టిక్కెట్లకోసం రండోయి అన్నట్లు తనకాడ చేసేడు. ఎవరిమట్టుకు వాళ్లు టిక్కెట్లుచ్చుకొన్న వాళ్లు బండీ రావడంతోనే ఎక్కిపోయారు.

యువతి గుడ్లనీరు తిరిగిపోయినంత యిదికివచ్చేసేసి గేటమ్మట ప్లాట్ ఫారంమీదికిపోబోతూవుంటే టిక్కెట్ కలక్టరు 'టిక్కెట్?' అన్నాడు. "ఉండండిసార్? టిక్కెట్లు దొరకలేదు. బండి వెళ్లి పోతోంది" అంటూ దిక్కులేనట్లు ఆప్లాట్ ఫారంమీద నాలుగు వెలపులా నిరాశచూపులు చూసేస్తూవుంది.

"గార్డుతో చెప్పి ఎక్కు" అన్నాడు టిక్కెట్ కలక్టరు. బండి సగం ప్లాట్ ఫారం దాటిపోయింది. గర్డుబండి ఆ దాటిపోయిన సగంలోనే వుండిపోవడంచేత గార్డు దొరికేటట్టులేదు. ఇంతకూ బండిలో టిక్కెట్టులేకుండా మఱి ఇద్దఱప్పుడే ఎక్కిపోయినారు. వాళ్లూ స్త్రీలే. వాళ్లూ క్రిస్టియన్ యువతులే. వాళ్లు ఊ తొంగి చూస్తూవున్నారు. "త్వరగా తీసుకురా!" అంటూవున్నారు.

అంతలో ఇదంతా స్టేషనుమాష్టరుచూసి ఈలేసి బండిని అమాంతంగా ఆపేశాడు. బండిలోవాళ్లంతా కదిలినబాడి ఆగిందేమిటా అని తొంగిచూచేరు. ప్లాట్ ఫారంమీద యువతి, బుక్కింగుఆఫీసులోకి వెళ్ళి టిక్కెట్లు కొనుక్కుతెచ్చుకు తిరిగి బండియెక్కేదాకా బండినిల్చిపోవడం, అతి విడ్డూరంగా మహావిడ్డూరంగా కనుగొన్నారు. బండిలోకెక్కి యువతి తన

వాళ్లకు టిక్కెట్లుఅందిచ్చి ఆసీనయై పకపకానవ్వుతూ "సలాములు సలాములు" అంది స్టేషనుమాష్టరుతో.

నిడదవోలుకుటిక్కెట్లుఅడిగి నిరుత్తరుడైపోయిన చవుపురాని మూర్ఖుడు ఆచర్యఅంతా చూస్తూ "ఆ: దానికి టిక్కెట్టిచ్చేగా. నాకిచ్చినోరుకారు." అనిఆనేసి వూరుకున్నాడు. వాడెక్కే బండిఏదో ఆబండి ఏవెంపుకు వెడుతుందో, దాని టైముష్లానో కూడా వాడికి తెలీదు

తనకు టిక్కెట్టివ్వక ఆమెకెందుకు ముందు టిక్కెట్టిచ్చారనే ఆ చదువురాని మూర్ఖుని పంతం. వెంటనే కిటికీదగ్గరకు వెళ్ళి "ఇవ్వవయ్యా ! నాకూను టిక్కెట్టువొకటి నిడదవోలుకు" అని గట్టిగా అఱిచాడు పొలంకేకలా!

"నీవు క్రిస్టియనువా?" అన్నాడు బుక్కింగుక్లార్కు. "ఆఁ" అన్నాడు మొండిగా ఆపల్లెటూరుమనిషి. "నీవు ఆడవానివా!" అన్నాడు. "ఆఁ"అన్నాడు. "నీవుయువతివా!" "ఆఁ". "అయితే పోయి స్టేషనుమేష్టరుతో చెప్పుకో ఆయనిస్తాడు టిక్కెట్టు" అన్నాడు బుక్కింగుక్లార్కు.

నిజమేఅనుకొని మనరయితు గేటుదాటి ప్లాటుఫారంమీదకు పోబోయేను. అక్కడ టిక్కెట్టుకలక్ట రడ్డుతగిలి అడిగాడు టిక్కెట్. "ఏమయ్యా! టిక్కెట్టులేకుండా ఇందాకా అబుల్లిని పోనిచ్చావు. నన్నెందుకు పోనియ్యవు?" అని వెఱ్ఱిగా మొదలకించాడు రయితు. "నీవు క్రిస్టియనువా!" అన్నాడు టిక్కెట్టు

కలక్టరు. "ఆఁ" అన్నాడు. "నీవు ఆడదానివా?" "ఆఁ" 'నీవు యువతివా?' 'ఆఁ'. "స్టుపిడ్! అంతంత మీసాలు మొహాన్నెట్టుకొని, నిలువెత్తు ములకాలకఱ్ఱ చేతపట్టుకొని, ముతక దుప్పటి మొలకట్టుకొని, గోనిసంచీమూటతో, కిర్రుచెప్పుజ్జోడుతో వున్న నిన్ను ఎవ్వడైనా క్రిస్టియన్ యువతివని అనుకోవడానికి అవకాశంవుందటూ?! షో! అవతలవుండు. అక్కడాకన్నం దగ్గఱిస్తారు టిక్కట్లు. ఇచ్చేదాకా కాచుకుండు. అట్టే పిచ్చి కేకలు వెయ్యకు" అన్నాడు గవర్నరుగారిలా ఆటిక్కట్టుకలక్టరు.

అప్పటికప్పుడే నిడదవోలుకేసి పొయ్యేజనం పూటుకుంటూ వున్నారు స్టేషన్ షెడ్డులో. ఆగలాభా చూచి వాళ్ళంతా యీ కావుచుట్టూ గుమిగూడేరు. ఏమిటి తగా యిదా అని అడిగారు. 'ఏమీ లేదు! మీకెందుకునాగొడవ. మీరేం ఆర్చేవాళా తీర్చేవారా! పార్వతీ పరమేశ్వరులా! వినాయకబ్బమ్మలా! నేతిన్నగా స్టేషనుమాస్టరుగారికే సెప్పేసెయ్యాల' అని రణగొణ ధ్వని చేశేశాడు రయితు. లాభం లేకపోయింది.

రైతు ఇక, తననాయకుడు చెప్పిన మాటలమీద కామోసు అనుకుని, నాయకుణ్ణే అర్జీరాసి పంపేసెయ్యమని, తన వ్రేలి ముద్రకాగితం ఒకటి నాయకుడికిచ్చేసి తనవూరు వెళ్ళిపోయి నాడు. రయితుల వ్రేలిముద్రలు వేసిన తెల్లకాగితాలంటే బ్లాంకు చెక్కుల్లా చెలామణీ అయిపోతాయి.



Preference to ruling race
Even at the Booking case;
Ryots are not at all great
Even at the Ticket gate;
To illiterates grave injustice
Even in trains did not cease!

అని పెద్దక్షరాలతో ఎక్కడ చూచినా "దొంగ లున్నారు జాగ్రత్త" అన్నమాదిరిగా "తిరుపతి దివ్యక్షేత్ర సుక్షేత్రం-తగ్గింపురేట్లు" అన్నమోస్తరుగా, బాహాట ప్రచార ప్రదేశాల్లో పెద్దముక్కలతోనూ మసిబొగ్గులతోనూ కనబడిపోయినాయి, వెంటనే ప్రతిరైల్లోనూ ప్రతిస్టేషన్ గోడమీదను, ఎగాదిగా చూచి ఇంగ్లీషురాని వాళ్ళు పర్యష్టగా తెలుసుకొంటున్నారు ఆరాసిన ముక్కల్లోని అర్థము, రైతుకెక్కడా ఆఖరుకు రైళ్ళల్లో కూడా గౌరవంలేదని. ఇంకాచిత్రం ఏమిటంటే లెజిస్లేటివ్ కౌన్సిల్లో ప్రశ్నలడగబడ్డాయి. "ఎవరు ఆముగ్గురు యువతులు? ఎవరు ఈ రయితు? వాళ్లెంతవఱకు చదువుకున్నారు? వీడెంత వఱకు ఆస్తిపరుడు? ఆబుక్కింగు క్లార్కు పేరేమిటి! వాని మీద ఏమైనా హోంమెంబరుగారు చర్యతీసికున్నారా?" అని. సమాధానాలు కూడా వెంట వెంటనే వచ్చేసాయి. "ముగ్గురూ యువతులు కాదు. అందులో వొక్క ఆమెయే యువతి" అనీ "రయితు వేలిముద్ర రయితు" అని, మూడవ ప్రశ్నకు నోటీసు కావాలనీ, నాలుగవ ప్రశ్న ఎరైసు కాదనీ.

ఇలాగ్గా లిజస్లేటివ్ కవున్సిల్లో మన ఈ రయితు సమస్య ఓ ప్రక్కను గాలించబడుతూవుంటే, డిపార్ట్మెంటల్ ఎంక్వైరీలో రైల్వే అథారిటీస్ రెండోపక్క చెరిగేస్తు' వున్నారు.

ఏలాగూఅంటే—బోర్డుఆఫ్ డైరక్టర్సునుంచి కాయితం మెడ్రాసొచ్చింది. మెడ్రాసునుంచి కాయితం కోదారికొచ్చింది. అక్కడితో ఆగక అప్పటికప్పుడే ఆ బుక్కింగుక్లార్కు ట్రావెలింగు టిక్కెట్టు కలక్టరుగా ట్రాన్సఫర్ అయిపోవడంవల్ల బండిబండీకి తిరుగుతూవుంది. ఎందుకోసం? ఆ బుక్కింగుక్లార్కు యొక్క ఎక్స్ప్లనేషన్ కోసం—ఈ భారతఖండంలో రయితు అంటే సామాన్యుడుకాడురో అని ఎక్కడిటిక్కెట్టు కలక్టర్సు రయితులకు గడగడలాడ్డమే ఆ పదిరోజులూ.



బుక్కింగుక్లార్కు తనవుద్యోగం వూడిపోయేటట్టుంది అనుకున్నాడు తనబసలో. బసఅంటే నీరు నిలిచేగట్టు క్రిందిపల్లంలో వో ఇసుకు పిచిగ్గూడు అనుకోండి. ఎక్స్ప్లనేషను సరిగ్గా రాయకపోతే రాసే కలంకూడా తిరగదు అంటులో—ఆ బసలో ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఒక అరడజను ఎక్స్ప్లనేషన్లు తోచినయి ఆ బుర్రకు.

మొదటిది మహాబోల్డైంది లేండి. ఏమిటంటే అది—"నేను వ్వారికీ ప్రిఫెరన్సు యివ్వలేను. మూర్చబడ్డ రెండుచేతులూ

క్రంతలోకి వొకేపర్యాయం మార్చబడ్డాయి. అంటే యువతి చేయీ రయితుచేయీ రెండూ వొకేమాదిరిగా కనిపించినయి, నేనవరికీ ప్రిఫెరెన్సు ఇవ్వలేను" అని అయితేగియితే కాస్సేపు రిఫ్లెక్టు చేసికొన్నాడు. ఆ సంజాయిషీ సత్యదూరం అని తెలుసుకున్నాడు. "Her palm was fairer and sweeter" అనుకున్నాడు. "మార్చబడ్డాయి" అన్నదానితరువాత పంక్తి కొట్టేసి యిలా వ్రాశాడు. "యువతియొక్క లేతపాటు చామన చాయ నన్నాకర్షించింది" అని వ్రాశాడు. అలా వ్రాస్తే తన కడుపుమీద తానే కొట్టుకోవడంకాదా అని వొక్కింత వితర్కించేడు. వితర్కించుకొని "లేతపాటి చామనచాయ", మీద గీతపెట్టి, కింద హంసపాదుకొట్టి, పైని వ్రాశాడు, "భాగ్యరేఖలు నన్ను ఆకర్షించినాయి" అని. వాటిపై నిక కలం నడవలేదు. తోచినంతా వ్రాసి ముక్కుసూటిగా తన సంజాయిషీ పంపించాడు. ఎవరు? బుక్కింగుక్లార్కు!

పైనుంచి అధికార్లు టెలిగ్రాం తీగమీదుగా లకోటా ప్రశ్న కొట్టారు. "Are you a palmist ?" అని. "yes" అని తిరిగి జవాబు. వెంటనే పైఅధికారినుంచి "Alright ! explanation accepted. Made permanent. Given grade," అని ఎక్స్ప్రెస్సువైరు!

దాంతో కౌన్సిలర్లనోళ్ళూ కట్టబడ్డాయి. ఇంగ్లాండు వెళ్ళి వచ్చిన హేమాహేమీల ఎగురూ అణిగింది.

చదువురాని రైతు "ఏమైం"దని అడిగితే చదువుకున్న ప్రతీ వాడు మగాడిలా చేతిబెత్తం తిప్పుకుంటూ ఒకటేమాట. 'Every man on this wide earth obliges first a fair palm. That's natural! That's natural!" అని. అది కాస్త తెనిగించి చెప్పండిబాబా అని రయితంటే చెప్పేవాడేడీ! ప్రతీవాడూ చప్పరించేసేవాడే!

?



| రచన | స్ఫూరణ | తొలిప్రకటనము |
| --- | --- | --- |
| [illegible]-11-1936 | రాజమండ్రి | "వినోదిని"లో |

శ్రీ

“గ్రాంథకోలకు – వికశితోత్సవ”

“ కవి ”

“కవికొండల వేంకటరావు”

నూతన ప్రణాళిక

1948 – 1950

ననుసరించి నాటకసహోద్దేశకు తపస్యవకాశముండా బిరాళ మొదంగి గుర్తుకెక్కిన

♦— పా ఠ కో ద్దీ ప కు లు —♦

♦ రాజమహేంద్ర వర కేంద్రప్రభ ♦

(11) శ్రీ సోమిస కామేశ్వరరావుగారు బి.ఎ., బి.ఎల్.,

(12) శ్రీ న్యాపతి కామేశ్వరరావుగారు బి.ఎ, బి.ఎల్.,



♦ విజయవాడ కేంద్రప్రభ ♦

(1) శ్రీ ముద్దానారాయణ శర్మగారు. బి.ఎ, బి.ఎల్.,

క॥ వేం॥

31—1—1952

[రాజమహేంద్రవర కేంద్రప్రభకు సంబంధించిన 1 మొదలు 10 వరకు గల పాఠకోద్దీపకు లితఃపూర్వ మచ్చుపడ్డ గ్రంథములం జేర్కొనం బడియున్నారు.]

## ముఖ్య సూచన

శ్రీ "కొండకొలకు వికసితోత్పల" 1948 – 1950 నూతన ప్రణాళిక కొలది మార్పులతో 1951, 1952ల్లో కూడ ననుసరింపఁ బడుచున్నది. వివరములు:—

| పాఠక సంజ్ఞ— | చెల్లింపనగు మొత్తం— | పడయు పుటలు |
| --- | --- | --- |
| శాశ్వత పాఠకులు | రూ 5— | 500 |
| పాఠక ప్రసన్నులు | రూ 10— | 1000 |
| పాఠక ప్రపూర్ణులు | రూ 20— | 2000 |

| | | |
| --- | --- | --- |
| పాఠకోత్సుకులు | రూ 30/— | వీరు అచ్చుతో నిమిత్తం లేకుండ కవి కృషిని నమ్మి విరాళములొసంగువారు వేఱువెలతో నిమిత్తంలేకుండ అచ్చుపడు గ్రంథములు తత్తదనుగుణ్యముగ వీరి కందీయబడును |
| పాఠకోత్కంఠులు | రూ 60/— | |
| పాఠకోద్దీపకులు | రూ 120/— | |
| పాఠకప్రతిష్ఠాపకులు | రూ 1116/— | |
| | అంతకు మించి | |

మరి:— ఉత్తర ప్రత్యుత్తరములు, ఉత్తరువులు, సొమ్ము బట్వాడాలు. చెక్కులు మున్నగునవన్నియు కవిపేరటనే జరుప వలెను. కవి చిరునామా:– శ్రీ కవికొండల వేంకటరావు గారు బి. ఎ., బి. ఎల్., ఇన్నీసుపేట రాజమండ్రి —తూ॥గోదావరి జిల్లా.

రాజమండ్రి.
26—1—1952

ఇట్లువిన్నవించు
ప్రకాశక సంస్థ
"అభినవాంధ్ర"

శ్రీ

"కొండకొలకు – వికసితోత్పల"

"కవి"

"కవికొండల వేంకటరావు"

ఉ ద్య మ ము ను గు ఱి ం చి న

1 9 5 2

హె చ్చ రి క

1948_ 1951 వఱకు పై యుద్యమమునకు సంబంధించిన నూతన ప్రణాళిక ననుసరించి సుమారు అయిదు వందల పుటలు, ముద్రణారూపము గనుగొన గలిగి నందులకు మేము కవిని అభినందించుచు ఆంధ్ర పాఠకలోకమునకు ఈ హెచ్చరిక నింకను ఇచ్చుచున్నాము

కవి తన కృతుల నీ వఱకువలెనే ఈ సంవత్సరమును ప్రచుఱించుచు తన యుద్యమమును సాధించగలడు. అందుకు తగు ప్రోత్సాహము నొసంగుట మన అందఱి యొక్క విధి అయియున్నది.

విశేష వైవిధ్యమును, వివేకమును, విశ్వాత్మకము నగు కళను ప్రసన్నము గావించి రసవంతముగా ననేక గ్రంధములను రచించిన శ్రీ కవికొండల వెంకటరావుగారి రచనము లన్నియు నచ్చుపడి మనము చదువగల భాగ్యము అచిరకాలములో మీ అందఱి తోడ్పాటున జరుగగలదని మేము ఆశించుచున్నాము. మేముగావించు ఈహెచ్చరికను వృధాపుచ్చక ప్రతిపాఠకుడును తనకు వలనగునంతలో హెచ్చుతరగతి పాఠకుడై, వెలనో, విరాళమునో చెల్లించి ఏతదుద్యమ చక్రమును నడువుదురుగాక!

రాజమండ్రి. 14–1–1952

ఇట్లు విన్నవించు,
ఉద్యమప్రోత్సాహక సంఘము.

“ కొండకోలకు – వికసితోత్పల”

“ క వి ”

“కవికొండల వేంకటరావు”

ఉద్యమ ప్రచురణ వినూతన ప్రణాళిక ననుసరించి యింత వఱకును ప్రకటితములైన పొత్తములు

(1) పెనుమంచిలిజైన దేవుడు [కథలు] వెలరూ 1—4—0
(2) హరివినోదము [సంపుటి] [పద్యములు] రూ 1—8—0
(3) ఇనుపకోట— [నవల] రూ 2—8—0
(4) పొట్టిరవికలూ- వాలుజడలూ [కథలు] రూ 1—0—0

మొత్తం వెల రూ 6—4—0

తమరింత వఱకు చూపిన పాఠకోత్సాహమునకు మా కృతజ్ఞల తెలుపుచు మీరింకను ఇతోధిక పాఠకులై ఏతత్ప్రచురణ పరంపరను ప్రోత్సహింప గోరుచున్నారము.

రాజమండ్రి
26—1—1952

ఇట్లు విన్నవించు
ప్రకాశక సంస్థ
“అభినవాంధ్ర”

---

వరా:— పుస్తకములు శ్రీ కవికొండల వేంకటరావుగారు
బి. ఎ., బి. ఎల్.,
ఇన్నీసుపేట — రాజమండ్రి.
చిరునామాకు వ్రాసిన లభయగలరు.

పత్రికా విమర్శలు పై పుస్తకాలన్నిటి పైన అభిప్రాయములు.

పెనుమంచిలి జైనదేవుడు :— "ఇందు పది కథలు గలవు. శ్రీ కవికొండల వేంకటరావుగారి రచనలు ఎరుగని పాఠకులు లేరు. వారు ఆంధ్రభాసాహిత్యమునకు అఖండముగా సేవచేసినారు, ఇందున్న కథలన్నియు మనోజ్ఞముగ నున్నవి."

జయభారత్, హైదరాబాద్.

హరివినోదము:—

"హరివినోదము, మన్మైక దైవసంప్రార్థనము, శతథా, కంటకుటీ ద్విపదలాత్మ అనే ఐదు రచనలతో కూడిన సంపుటం మాకార్యాలయానికి చేరింది. దాన్ని కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరించేమనిమనవి.

రచయిత కూలంకష ప్రజ్ఞాసమన్వితుడు పూర్వగ్రంథాలలో వున్న మహత్తరమైన ఆధ్యాత్మిక భావాల్ని చక్కగా జీర్ణించుకుని సూరిజనరంజకమైన భాషలో పరతత్వాన్ని కూర్చి ఎన్నో పద్యాలు వ్రాసేరు."

ఎడ్వర్డ్ రెజరు, విజయనగరం.

ఇనుపకోట:—

"భావిభారత పౌరులు కాబోయే విద్యార్థి లోకం ఇనుపకోటతో పరిచయం కలిగి ఉండడం అవసరం"

ఆంధ్రప్రతిభ, కాకినాడ.

## శ్రీ కవికొండల వేంకటరావుగారి రచనములు

వెలకిప్పుడు సిద్ధముగానున్నవి. పుస్తకభాండాగారములకు అత్యంతోపయోగకరములైనవి.

| | | | |
|---|---|---|---|
| (1) | పెనుమంచిలి జైనదేవుడు వెల ప్రతికి [కథలు] | రు | 1—4—0 |
| (2) | హరివినోదము [పద్యసంపుటి] | ,, | 1—8—0 |
| (3) | ఇనుపకోట [నవల] | ,, | 2—8—0 |
| (4) | పొట్టిరవికలూ – వాలుజడలూ | ,, | 1—0—0 |
| | మొత్తము రూ. | | 6—4—0 |

అయితే 'సెట్టుగా నాలుగు పొత్తములు' ఆరు రూపాయలు మాత్రమే ముందుగా ఆరురూపాయలుపంపుచు సెట్టు నాలుగు పుస్తకముల కొరకేపరి నుత్తరు వ్రాసంగువారి కగు తపాలఖర్చులు ప్రకాశకులే భరింతురు. లేనిచో కొనువారు భరింపవలెను.

పుస్తకములు వలయువారు ఈ క్రిందిచిరునామాకు వ్రాసిన బడయుగలరు.

చిరునామా

శ్రీ కవికొండల వేంకటరావుగారు. బి.ఎ., బి.ఎల్.,

ఇన్నీసుపేట – రాజమండ్రి.